# THE BOOK WAS DRENCHED

శ్రీ

శివాభ్యాంనమః

# వీరకంపరాయచరిత్ర

మను

# శ్రీ మధురా విజయము

ఇది

నందవోలు గ్రామవాస్తవ్యులైన

బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారిచే విరచితము

శ్రీ విజయనగర సింహాసనాధీశ్వరుండైన

బుక్కదేవరాయని కోడలగు

**గంగాదేవి**

రచించిన భర్తృచరిత్రాత్మకమైన గీర్వాణ కావ్యమునకు

నాంధ్రీకరణము.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు

కమలా ముద్రాక్షరశాల, తెనాలి.

# నివేదిక.

సజ్జనులారా!

ఈకావ్యము సంస్కృతమున స్త్రీకృతి. ఆయమ కర్ణాట విజయనగరీ సంస్థానాధీశ్వరుఁ డగు బుక్కభూపాలుఁ గోడలు. వీరకంపరాయని పట్టపుదేవి. ఇందలి శైలి కచ్చుపడి నే నాంధ్రీకరింప నెంచితిని. కాని యీగ్రంథమునఁ గొంతకొంత శిథిలమైనట్లు ముద్రితమై యుండుటచే, నింతకాలము సందేహించి యూరకుండియు స్నిగ్ధుల ప్రేరణయు, రసపరతయు నాంధ్రలోకమున కీయున్నంతవఱకైన వెల్లడి సేసి కృతార్థుఁడ నయ్యెదఁగాక యను నుత్సాహంబును బ్రోత్సహపడ నింతవఱకుఁ బూర్తి సేయఁ గలిగితిని. ఊరకొనలేక, శిథిల భాగంబుల నొకరీతిగా నదుకు వేసిన నాసాహస మభియుక్తులు క్షమింప నర్హులు. రసభంగము దోపకుండ నిదిచదువుకొనుఁడు. చారిత్రాంశమునకు మూలము పూర్తిగా దొరకిన యెడల దానిని గ్రహింతురుగాక యని, తద్జ్ఞులఁ బ్రార్థించెద. ఇట్టి సరసమగు కావ్యము నొరులకీఁజాలక దీనిలో వ్రాసిన సందర్భముతో నాగురువరులగు శ్రీ, మునగొండ నాగలింగశాస్త్రుల వారికిఁ గృతి సమర్పణ మొనరించి సఫలశ్రముఁడ నైతిని. తక్కువిషయము లెల్లఁ గ్రంథమే తేటపఱచెడు నని, విస్తర భీతి విన్నవించుకొనుచున్నాఁడ.

హాయనము కృతిపతిగాఁగ నే । డెసయఁ జేసి
తమ్మచతురంత యూనోత్స । వమ్ము బ్రాహ్మి!

సీ. మహితోల్లాసు నొసగ్చితమ్మమును స । న్మల్లిశ కృత్య
ర్పణ । ప్రహితా మేయ పుణోత్సవాకలనచేఁ । బ్రావీణ్య
మొప్పార శా । స్త్ర హితోక్తి న్నెఱయించి తియ్యో డ
సుసి । ద్ధంబౌ జుమీ! శారదో । స్వహము లసద్గుణము
ల్స్వకార్య గముల । న్వాకల్పించు వాగీశ్వరీ!

శా. ఆయుష్మంతునిఁ జేయుమో జనని! వి । ద్యార్థిం గవి
స్మత్సుతున్ । శ్రేయస్కాముని ద్వత్పదాశ్రయుని సు ।
శ్రీరాఘవోపాఖ్యునిన్ । నాయుల్లాసముపొంగ నీనెఱిన
యూ।నారాయణాభిఖ్యునిన్ । శ్రీయున్ సంతతి సౌఖ్యమున్
యశము భా । సిల్లం దయామూర్తివై.

తే. మొనసి శీవంబ! వాగర్థ । మూర్తి వగుచు
నర్ధనారీశ్వరాహ్వయ । మైన తత్వ
మై జగత్కారణంబన । నైన నీదు
మహిమ శ్రీదేవిపతి వీని । మనుచుగాత.

తే. వాసిగలుగు తాడేపల్లి । వంశమునను
బుట్టి పుట్టిన యది మొద । ల్పాణ్యరాశి
వైన నిను గొల్చు పేధర్మ । మని మెలంగు
వాఁడ వేంకటప్పాభిఖ్య । వఱలువాఁడ.

---

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 6 | కావ | కావ్య |
| 5 | 2 | హీంర | హాంర |
| 11 | 13 | మాంళి | మాంవి |
| 12 | 12 | ఉష్ణు | జిష్ణు |
| 14 | 6 | మైన | యెస |
| 19 | 9 | నే్ప | నేర్ప |
| 21 | 16 | బహునాని | బడిసవి. |
| 27 | 15 | మేల్మి | మెఱుఁగు |
| 31 | 7 | మగుట | ముగా |
| 33 | 19 | నీవ | నవ |
| 45 | 16 | ష్పరస | చ్ఛరల |
| 47 | 11 | చాంగు | చాంగి |
| 52 | 2 | శాంలి | శాంగి |
| 55 | 7 | కలిత | గళిత |
| 57 | 11 | లగు | లంగు |
| 59 | 15 | కదా | కాని |
| 70 | 19 | కందు | కంచు |
| 77 | 9 | నిచా | నియంగచా |
| 91 | 23 | యవ్వ | య్యావ |
| 97 | 13 | జిఘ్ను | జిఘు |
| ,, | 16 | బుద | బునఁద |
| 100 | 19 | కృష | కృష్ణ |
| 101 | 5 | య్యావనే | య్యావనీ |



ఓం

శ్రీపరమేశ్వరాయనమః

# శ్రీ మధురా విజయము

## ప్రథమాశ్వాసము





నాథుండు సగం బపర్ణసగముం । జేకొన్న లేకున్న
య । ట్లైనా నా భువనంబులుం దనదు లీ । లార్థం
బులై యుండ వి । ద్యా నిష్ణాతుల తత్త్వదృష్టి కభి
ల । క్ష్యంబైన తేజంబు ని । త్యానందంబుగ నాగ
లింగ గురు శి । ష్యౌఘంబుఁ బాలించెడున్. 1

వ. అని సకల భువనాధిష్ఠానంబై నిష్కలంబైన బ్రహ్మంబు నభిధ్యానించుచుఁ దదభియోగ ప్రసృత ప్రజ్ఞానుసారిణి యగు వాణిఁ గైకొని యున్న సమయమ్మున. 2

క. భాషా విశేష గతముల
శేషంబులు నెఱుఁగు ప్రోడ । శివయోగి సభా
భూషణము నాగలింగ మ
నీషి ననుం బిలువనంప । నేనతిభక్తిన్. 3

సీ. కావ్యరసంబులా । కలిదీరఁ గ్రోలి మ
త్తతఁ జెందియున్న సో । దరుల తోడ
శాస్త్రార్థములయు ర । సజ్ఞమూరసనయు
న్భావంబుఁ దెలుపు బాం । ధవుల తోడ
నీ పదంబున నె మా । కీపదం బనియెడు
కరణి మించెడు శిష్య । వరుల తోడ
వైదిక లౌకిక । వ్యాపార పరిణత
త్వము నొంది యున్న మి । త్రముల తోడ

తే. సాంధ్య సమయోచితాచార । సమితిఁ దీర్చి
కుశ మృగాజిన సంస్తృత । కుతల మెనసి
సరసముగ మాటలాడు నా । చార్యవరున
కెఱఁగి పనియేమి యనుడు న । న్నెంతొ నేసి. 4

తే. మృదుమధుర భావసరస గం । భీర బంధ
మైన కావ్యం బొకండు మా । కప్పనంబొ
నర్ప గావలె ననుచుఁ జి । ర్నగవు తోడ
నర్థ్హణీయుఁడు నన్ను । నర్థ్హణలఁ దనుప. 5

వ. పారవశ్యంబున నేనంతవాడ నయకుకొని మున్నను నేనట్టి
భావంబుగల వాఁడనగుటంజేసి గురుదక్షిణ సమర్పింపనిది
గదా తఱియని తలఁచి యంతకుమున్న సంకల్పితంబగు

గంగాదేవి విరచిత మధురావిజయ కావ్యాంధ్రీకరణ
మీఁకృతికి నర్హమైనదిగా నెంచి పూజ్యపాదుఁడగు నస్మజ్జ
నకుండొకపరి ప్రస్తావవశంబునఁ జెప్పిన †"శివునకో" యను
పద్యముభావంబు భావగోచరంబగుటయు పొలితిగల
రసజ్ఞుఁడు కృతిపతిగా దొరకుట నాభాగ్యమయని మెచ్చి
యప్పనికిం బూనుకొంటి నింకఁ బావనంబగు నస్మద్గురు
వరువంశం బభివర్ణించెద. 6

సీ. సర్గోత్తమంబైన సప్తర్షిమాలికు
ధన్యుఁడెవ్వాఁడు మ । ధ్యమణిభూతుఁ
డెల్లలోకంబుల । నెల్లకాలంబుల
నెవ్వానికీర్తియ । హీనమరయ
బ్రహ్మమెచ్చించి యె । వ్వాఁడు వేదంబుల
నవతరింపఁగఁ జేసె । నవనిమీద
శ్రీరామమూర్తికి । బ్రీతిమై నెవ్వాఁడు
వేల్పులఁ బనిగొని । విందొనర్చెఁ

తే. బ్రలయ కాలంబులందున । పవ్వయుండు
చిరతపస్సం ప్రబుద్ధాత్మ । సిద్ధమూర్తి
వర్ణనాతీతుఁడల భర । ద్వాజమౌని
వెలయునాఘును వినకున్న । వీనులున్నె. 7

---

† ష. శివునకో రామకృష్ణులకో । శిలమునెక్కైన నిన్నుభక్తి ని
భవమున కెట్టులేనిడఁగ । భారమువాయునటన్న నీయెడ
న్ననవనమౌవికాసముగ । నంబడనొందెడవారలుండ మా
యవమతి యేమనంగనగు । నమ్మదయానతి కావ్యకన్యకా.

క. ఆలంకారిక శాస్త్ర వి
శాలీకృతికృతి యజస్ర । శంభు సమర్చా
శీల మనస్కుఁడు విద్యా
కూలంకషుఁ డుద్భట కవి । కూటస్థుఁడుగాన్ 8

ఉ. ఆమునివంశమందుదయ । మందెగు నాధ్యుఁడు రామలింగసం
జ్ఞా మహనీయుఁడాగమ వి । శారదుఁడై శషడక్షరీ జప
త్రాసితకిల్బిషుండతని । సాధ్వియనందగెఁ బేరమాంబ యు
ట్టామిను వంబొసర్చి నమ । హానియమంబులకున్నెలంబుగన్.

క. ఘనమతి యఘోరపతి నా
జనించెను దనరాజుఁడతఁడు । సకల కళలకున్
ఖనియననై తీర్థంబులు
మునుముట్టం గొలిచి శివుని । ముదితునిఁ జేసెన్. 10

చ. అతనికి బుచ్చమాంబయను । నయ్యె, సతీగుణజన్మభూమివి
శ్రుతమతి జాయగా శ్రుతము । రూపము పేర్మిముడివొక్క
చాయగా । నతి సుఖవృత్తి ధర్మమున । నర్థమునం బొర
పాటులేక యూ । జత మొలఁగంగ వారలకుఁ । జయ్యన ను
ద్భవమంద రాత్మజుల్. 11

క. వీరేశ లింగమనఁగా
ధీరుఁడొకఁడు నాగలింగ । ధీమన్మణి యొం
డారాధ్య చరణసరసిజు
లారచిత మహాతపస్కు । లభవపరాత్ముల్. 12

క. వారలలో నవరజుఁడతి
భూరిగుణుఁడు నాగలింగ । బుధుఁడలరెను వా

ణీ రమణీ హీరమణీ
వారరవా భాసివదన । భాగుండగుచున్ 13

తే. చదువుట యెఱుంగరట విచ । క్షణుఁడగుటయు
ముఖలు లెఱుఁగుదురట యింక । సరయఁగాను
జపతపంబులు సేసిన । జాడమంత్ర
సిద్ధుఁడని మాత్రమని రల । బుద్ధిమంతు. 14

క. లీలాశీల కలాదుల
కాలయమ్మె వీరలక్ష్మ । మాంబికయనఁగా
నా లలితాత్మునకుం బ్రియు
రాలయ్యె న్బుద్ధిమంతు । రాలధి సేవన్. 15

తే. అతిథులకుఁ బెట్టుచో నామె । యన్నపూర్ణ
యగు నెడఁ జెకెక్కె నడవడిఁ । దన్విలక్ష్మి
నోరువిచ్చిన యపుడెల్ల । నారివాణి
యెట్లు సృష్టించెనో కాని । యింతి నజుఁడు. 16

క. శ్రీరంజిల్లఁగఁ బతిసే
వారతితోఁ గొల్వఁబడెను । భవుని నెనరుతో
నా రామ సోమనాథున
ఘోరపతి స్వీరభద్రుఁ । గొడుకులఁ గనియెన్. 17

ఆ. అక్కుమార రత్న । హారంబున రహించు
మధ్యముండుదార । మణియవోలెఁ
దాతఁబోలు మూల । భూతుఁబోలును గాద
టన్నఁ బోలుధాత । నన్ననసదె. 18

మ. అతిశోకప్రమదావహోన్నతి సము । ద్యద్వీరమాహేశ్వర
వ్రతదీక్షాపరుఁడై యఘోరపతి యా । రాధించెం బంచాక్షరీ
శతరుద్రీయ ముఖంబుల న్భవనిరా । సంబాత్మ నర్థించి శా
శ్వతు సర్వేశు ధ్రువస్వదానుభవసం । భావ్యున్ భవానీపతిన్. 19

మ. రతిశిక్షించు విలాససంపదల వా । గ్రామామణిం గెల్చు స
త్ప్రతిభం బాగను బ్రాభవంబున శివం । దర్శించు శ్రీ దేవినా
తత కాంతిన్సరిలేరొరు ల్తనకునా । ధన్యాత్మ జ్వాలాంబయు
న్నతియయ్యె న్నతియయ్యె ఘోరపతికి । న్సర్వార్చనాసిద్ధినాన్.

క. పతిమాట కడుగు దాటదు
వ్రతమెడలఁగ నీదు భవుని । భావించు మదిన్
సతియనఁగ నిదియపొమ్మని
సతులుం బతులాత్మ మెచ్చ । సాధ్వి సుపథయై. 21

మా లి ని.

నగవరసమధైర్యు । న్నాగమల్లేశ్వరాఖ్యు
న్నగరభవగభీరు । న్నాగలింగాఖ్య సూరి
న్జగదభినుతభావు । న్రామలింగాభిధాను
న్నగువ సుతులఁ గాంచె । న్మల్లమాంబం దనూజన్. 22

తే. అందఱును వర్ణనీయులె । యగుదురైనఁ
బ్రకృత మనుసరణీయంబు । ప్రకటసత్వ
మహిమ భేదంబు వారిలో । మధ్యమునకు
ముగురు మూర్తులలో మధ్య । మునకు లేద. 23

శా. ఆధీమన్మణి నాగలింగ సమభి । ఖ్యాతుండు చిన్నప్పయా
యాధాత్రీతల మెల్లఁ దిర్గి తగ నా । యావిద్యలెల్లం గురు

స్వాధీనుండయి యభ్యసించి విబుధ । వ్రాతంబులో మేటియై
బోధించె న్నిగమాగమమ్ములు గుణా । ఢ్యు ల్శిష్యులిం
పొందఁగన్. 24

ఆ. ఆమహాత్మునకు ను । మామహేశారాధ్య
తనయ విదితవినయ । వినుత చరిత
లింగమాంబయనఁగ । మంగళాంగి ద్వితీయ
యయ్యె గుణగణములఁ । నద్వితీయ. 25

క. జననుత పాతివ్రత్యం
బనువ్రతులఁ బ్రోపు శివస । మారాధనమున్
వినయమ్ము తిథి సమర్చన
మను నాచారములు లింగ । మాంబిక సొమ్ముల్. 26

క. ఆయెల నాగసహాయము
గాయతమతిఁగాంచె సుతుల । గార్హస్థ్యంబుం
శ్రేయముగ నడపె నెందున
పాయముఁ జొఱనీక శివుఁడు । పాలింపంగన్. 27

సీ. వాదమ్మొనర్చెనా । ప్రతివాది దుర్గ జ
మ్ములు భయమున దుర్గ । ములకు వాఱు
జదివింపఁజొచ్చెనా । ఛాత్రశుకమ్ములు
భాగవతప్రౌఢిఁ । బలుకనేర్చుఁ
గావ్యంబు వ్రాసెనా । కవిరాజహంసమ్ము
లానందమున నోల । లాడఁజొచ్చు
ధర్మమ్ముఁ దెలిపెనా । దుర్మతివృషభమ్ము
లవశమ్ములగుచుఁ గ । ట్టువడియుండు

గీ. సార! వ్యాకరణాదిశా । స్త్రార్థవేది
సంతతార్చిత శర్వప్ర । సాదమోది
విబుధమాత్రుండె నిష్ఠుర । విమతభేది
ధన్య తమ నాగలింగాఖ్య । తత్త్వవాది. 28

క. ఆ పండిత సత్తముని మ
హోపాధ్యాయాది బిరుద । యోగప్రథితుం
బాప విదూరుంగొలిచెద
నీప్సితం బప్పనముగ । నిచ్చి ప్రపత్తిన్. 29

~ షష్ఠ్యంతములు. ~

క. ఏవంవిధ గుణరత్న మ
హా వారి నిధానమునకు । నంచిత శైవ
శ్రీ వీరవ్రత విధి సం
భావిత భవ భావనా వి । భావ్యాత్మునకున్. 30

క. విదితాత్మ జ్ఞానునకు
న్మదిగొండాన్వయ శశాంక । మూర్తికి సుగుణా
స్పద శిష్యప్రవరునకు
న్ముదితునకు న్నాగలింగ । బుధమాన్యునకున్. 31

క. అస్మయ మానసునకు నతి
విస్మయకర సాహితీ ప్ర । వీణత్వ యశో
విస్మారిత రాజకునకు
నస్మద్గురు సత్తమునకు । నతి మహితునకున్. 32

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన మధురావిజయం
బను కంపావనీంద్ర చరిత్రంబునం గంగాదేవి సంస్కృత

రచనా చాతురీ పరిపాటీ ప్రారంభ ధోరణికి నాంధ్రంబున
సంస్కృతి యెట్టిదనిన. 33

తే. అజుఁడు స్త్రీపుంసము సృజింప । నాత్మఁదోఁచు
మాతృకారూపమున గరి । మంబుగూర్చు
చిత్ప్రకాశాత్మకుల సల । శివుల మేలి
బత్తిఁ బ్రాపింతు బోధ సం । పత్తి వెలయ. 1

క. చెంతం జేరినవారల
చింతాతంతువులఁ ద్రెంచి । సిరులగురియునా
సంతానకంబు మాకు
స్వాంతావల నదనుఁడభయ । దానము సేయున్ 2

తే. తమ్ములకుఁ గూర్చు కవులయా । స్యమ్ములనెడు
పంజరమ్ముల శారికా । త్వమున నంద
గించి చైతన్య వార్ధిఁ బొం । గించునట్టి
యమలిన సరస్వతీదేవి । నాశ్రయింతు. 3

క. అసదృశ సార్వజ్ఞ్యనప
వ్యసనునిఁ గొనియాడుదుం గ్రి । యాశక్తిగుహున్
లసమాన సర్వమంగళ
నసమాంబకుఁడ పరుఁడనఁగ । నగువిబుధమణిన్. 4

తే. పద్య నిర్మాణ విద్యకుఁ । బ్రథమ పదము
పృథివిఁ బ్రాచేతసుం డన । బ్రథితమైన
వాని తిలకంబు సరసుల । మానసముల
సుప్రసాదంబు చొప్పడఁ । జూచుఁగాత. 5

తే. వ్యాస వాఙ్మయమం దిక్కు । వంశ మంతఁ
బోలెఁ బ్రతిపర్వమందు నా । పూర్వ మగుచు
సహృద యాహ్లాదకరసప్ర । సార మబ్బ
దాన నానని కవిత కం । దమ్ము గలదె. 6

సీ. కవులెల్లఁ గాదొకో । కాళిదాసుని దాసు
లతని యర్థములతో । సాటి యెంత
భారవి భారతి । వర్ణనావళిఁ బోలి
యొత్తడి సౌరభ్య । మొత్తరించు
వాణి మీటిన వీణ । క్వాణంబు కాకోదు
ల్భావింతు రే భట్ట । బాణు బాణి
నమృత సంపత్తుల । నాచమించిన దండి
వాక్స్ఫూర్తి విధిసతి । వలపుటుంగ

తే. మనుస మెననికి నిడవుక । స్త్రామృత కవి
యీవి ప్రమానుల పూఁదేనె । తెల బంగారులు
పుడుకు దోడుకల భవభూతి । నుడి సుఖమయ
మమృతముం బోయు బుధుల క । ర్ణములయందు. 7

ఉ. తిక్క కవీంద్రుసూక్తి హిమ । దీధితికౌముదిపట్లు లాసతో
నక్కవులచ్చకోరముల । యాదృతిఁగొందురగ స్త్రీసహాగిపెం
పెక్కనపాండితిం దెలుపు । చెంతయుడెబ్బదినాళ్లు నేత్రము
తెన్నకొనియున్న కైతస్పృహ । చేయుతఁ గోవిసుండొ
దరింపఁడే. 8

తే. వ్యాస సంవాదమునఁ బూని । భారతేమః
కథనుజూపించె నాటక । కైతవమున

సవని గంగాధరాఖ్య మ । హాకవీంద్రుఁ
డతనిఁ గొనియాడవలదె కా । వ్యములయందు 9

తే. ఎవనిమహిత ప్రసాద సం । స్తవముతోడ
మమ్ముఁబోటుల సర్వవి । ద్యమ్ము లైనసె
జయముఁ గాంచెదుఁగాత శా । శ్వతముగాఁగ
విశ్వనాథాభిధాన క । వీశ్వరుండు. 10

సీ. సర్వమ్ము జెలుచుదో । స మనుమంతయుఁ గృతి
నగు రుద్రనమునున్న । మట్లు నిలచి
పతికి నపాయములేని । సతివోలె నిర్దోష
యయ్యునుచింపని । యగుణవాణి
మంచిఁ జోనాడి నె । మకుదోసముఁ గుకవి
వనిమాలి వీడివే । పంగొను గాక
మహహరించిన కావ్య । మది యెంత మెప్పించు
మఱసించు నెన్నాళ్లు । మాయగాను

తే. చతురమగు నర్థమొకట సొ । శబ్దమొకట
భావమొకచోట రసమొక । బాటఁబాయు
నన్నియునుఁ జెల్మిఁగొక్కెడ । నందియున్న
గ్రంథము లభింప దధిక భా । గ్యమునగాని 11

చ. కలరిలఁ దార్కికుల్ దలచు । కామము శాబ్దికులుండవచ్చు సా
ర లలిత వాక్సుధారస క । రండములౌ కవులంత కాన రా
రలఘుయశంబొసంగుఁబర । మార్థముఁ గూర్చుదొసంగడిం
చునిచ్చలుమనకింప్రబోధమిడు । సత్కవిసూక్తి యొకండొన
ర్పదే. 12

ఉ. పండితులార సత్కవుల । వాణి వినం బ్రతిమాల నేల యొ
క్కండె పసకొల్పు నేయుళులఁ । గమ్మని పూవులఁ దేనెలానఁగా
రెండని కాన నాదు మధు । రా విజయంబను కంప భూతలా
ఖండలు సచ్చరిత్రమునఁ । గర్తములందనియింపు డీరలున్. 13

సీ. కోదండల నలమంచు । కొండచిల్వల శేషుఁ
డమరుల హరివోలె । నాది నృపులఁ
దేజస్వి రవి కన్న । స్థిరుఁడు మేరువు కన్న
వారిధి కన్న గం । భీర భావుఁ
డని వివేకము మంత్రి । యని విల్ల బలమని
తన కేల కోదండని । తలఁచు వాఁడు
శ్రీదుఁడు సమవర్తి । జిష్ణువు భువనేశుఁ
డన నిలసురమూర్తి । యైన వాఁడు
తే. తరుణ హిమధాము కన్న శ్రీ । తలుఁడు నత స
మస్త సామన్త మస్తక । న్యస్త శాస
నుండు హరిహర రాజాను । జుండు కలఁడు
బుక్కరాజ సమాఖ్య భూ । భువన విభుఁడు. 14

మ. అవమంథ ద్రుప్యద్వాహినీశమథన । వ్యాపార పారీణమే
భవిభూభృత్తగు జేయి తెచ్చిన యశో । భారంబులారార్యావళిం
జెవికి న్మౌక్తిక కుండలమ్ము లెదకు । న్శ్రీచందనా లేపము
ల్నవకర్పూరములానసంబునకునై । లాలించె నశ్రాంతమున్.

శా. వైరిప్రాణస మీరణాహరణ దు । ర్వారక్రమంబైన యే
ఢీగోత్తంసు భుజంగమైన యసికీ । ర్తింగాంచుకంబూడ్చె వి

స్తారంబై యదె సద్గుణోల్లసితమా । ధాత్రాండభాండంబునిం
డారంగప్పదుకూలచేలమునగా । ధస్ఫూర్తిని ష్వాగ్రథగాన్.

సీ. రమ రక్షణోన్నిద్రుఁ । బ్రాపించితలపడ
యోగనిద్రాజడు । నొక్కనాఁడు
కలిఘుర్మ సంప్లుష్ట । మిలధర్మతరువు దా
నాంబుసేకంబున । నంకురించెఁ
శాదపీఠోగ్రఘర్ష । పనితమాళులు నృపు
ల్కడల జయస్తంభ । కలనఁగాంచి
గలప్రతాపాగ్ని హే । తులముట్టి కోర్దెల్పె
మార్తురకీర్తుల । మలిసమూస్త

తే. లగుల గతిజైత్ర యాత్రల । కష్టవెట్టి
దవుఘ మొగిళులఁదెచ్చి బం । ధించి రసఁగ
నజిరములయందుఁ బొలుపొందు । విజయగజము
లౌర! బుక్కావనీంద్రు మ । హావిభవము 17

ఉ. ఆక్షితి పాలుదక్షిణాశ । యంబుకృపాణముఁదాల్చువంక నై
పక్షరమాళివేణికలఁ । బట్టెడు శిక్షమెలంగెనంచు సం
ధుక్షిత సాహస ప్రకృతి । దుర్గ్రాద్రిదిలేశ్వర కేశపాశము
ల్దక్షిణమై గ్రహించెడు న । దక్షిణపాణియుమచ్చరంబునన్

ఉ. ఆధనదుండు దేవవిభుఁ । డైనను లెక్కకురారనంగ దు
ర్యోధన ముఖ్యులెంత యన । నొప్పసిరి న్వెలసిల్లు నల్లభూ
మీధవుయాత్రలందురగ । మృష్టరజంబవిమృష్టమాచుసం
జ్ఞాధవునాత్మవాహువనుఁ । సందియముంగలిగించునిచ్చలున్

క. విజయ సమార్జిత వైభవుఁ
డజితుండగు వానికి విబు । ధాఢ్యంబౌ
విజయాహ్వయ నగరము శత
యజనున కమరావతి గతి । నలవడి యుండున్. 20

తే. దేవలోకంబుఁ జుట్టి యు । ద్దీర్ఘమైన
స్వర్ణదిం బురుడించు మ । చ్చరమునఁ బలెఁ
బరిఖ సొంపున నొప్పు న । వ్వురము చుట్టుఁ
దవిలి ప్రవహించుఁ దుంగభ । ద్రా స్రవంతి. 21

వ. మఱియుఁ జెన్నెసయు నన్నగరీకుమారి ఘుడమి పడఁతి పొక్కిలి వలెఁ జక్కనైనదియు దీవలు వాఱు కలిమికలికి కెలసంబుల కాలవాలంబన జెలువారు నదియు నవఘగిరి నధిగమించు నదియునగు వప్రంబుచే నలంకృతంబయి, సౌనాసీర బాణాసనంబు నాహ్వానించు నంచితానంత రత్నకాంతుల రత్నసాను సానువుల మాదిరి నాకసంబు నాకగొను గోపురంబులకుఁ బ్రాపై, వికస్వర నాగకేసర కర్ణికా రాశోక చంపక రసాలాది సాలభసాల సంచార ప్రాంచితంబు లగుట వసంతు సంతిఘురంపు సొంపు సింపు పవనంబుల నపవాతితంబై, కప్పురపుటనంటి తోటల బాటలఁ బవ్వళించిన కస్తూరికా మృగంబుల వలన గంధిలంబులై మానసభవు మహాదుర్గస్థానంబులుం బోని, కేలీ శైలంబులఁ గరంబితంబై, మానికపు మెట్టుల కట్టుబడి బిట్టులరి కమ్మని తమ్మిపూల యొమ్మెల కిమ్ములయి కలహంస కులాకులంబులగు విలాస కాసార పరంపరలచే

భాసురంబై, అశేష శేషతురాషాట్ప్రధాన రాజధానీ నిర్మాణ సమర్పితములగు కీర్తి స్ఫూర్తులనఁదగు శారదనీరద గౌరంబులైన ప్రాసాదంబుల ప్రసాదంబుల నేకమానోత్సేధమై, ఎసక మెసఁగు తీవఁబోండ్ల మైదీవల విలాసంబుల కానానంబగు వనవాటిక యని దక్షిణదిశా సరోజదృశా క్షీణసంబగు ఫాలతలంబునందలి లలాటికయనియు ద్విజరాజ సముల్లాసంబుఁ గల్పింప నిత్యత్వంబుఁ జేకొన్న రాకానిశీథినియనియు గంధర్వ గణసన్నిధానంబున దీపించు నవీన సురసహస్రాని యనియు భుజంగసంఘములకుఁ దావలంబగు భూతేశ్వరు మహాళిస్థలి యనియు సుమనస్సంచయ సంచరణ ప్రచురంబైన సువర్ణగిరి మేఖలయనియు, యదృష్టాతిశయముల లీలయో, సకలశ్రీల శాలయో, సర్వరత్నంబుల మాలయో, పున్నెపు మున్నిటి వేలయో, యనియు వర్ణించుచు నాశిష్టాగ్ర్యో పాధ్యవసాయాది మూలధనులగు కవివరులు శౌరిలునాచు నత్ప్రిత్యా లతికలకంద గానిదియై మిన్నంది స్వభావ సుందరియై యుండు.

అచ్చటి రమ్యంబులగు హర్మ్యంబుల కొనలయందు నడుచు మార్తాండ బింబంబు చూచువారల మదికి సువర్ణ కలశభ్రాంతి సంతరించు. మఱియు నచ్చటి విశాలములగు చంద్రశాలల నాడుకొను ముగ్ధమృగశాబకాక్షులు ముత్తియపుఁ బంతియనుకొని మాటిమాటికి శశిబింబంబు నవలంబించి విడుతురు. ఇంక నచ్చోట ప్రతిధ్వనించు సంగీతక మృదంగంబుల భంగు లేకాలంబు శిఖండులఁ దాండవింపఁ

జేయకుండవు. ఇంతియ కాక యయ్యెడఁ బద్మరాగ శిలా
చ్ఛురితంబులగు ప్రదేశంబులు, తమ వెంబడిఁ దిరుగాడు
వారివాహంబులకు సాంధ్యత్వం బెప్పుడు సంపాదింపకుం
డవు సరిగదా! సాయం సమయముల యందు మాత్రము
లోపలి దీపముల చూపునకో పని భయమున వెలి వాకిట
చీకటి మూకలసఁ బ్రాకల్యంబు వహించి బాలమార్గంబుల
నుద్గమించు ధూప ధూమంపు బాముల నవ్వానికి నైల్యంబు
తోడి బలు పొసంగుటయు చిత్రంబు. ఆపురి వాపికల మణి
సోపానంబుల సంచరించు జక్కవ లొక్క మాఱటి విరహం
బెఱుంగని సుఖంబుఁ గనుట రాత్రులకు క్షణదా నామంబు
సార్థకమయ్యె. ఆ యూరి వారిజాక్షుల ముఖాంభోజ
ముల లావణ్య ద్రవిణము తనకు లభింపమి లజ్జితుఁడగు
చంద్రుని యంతరము మనోవ్యథచేఁ గమరినట్లు కలంక
మను పేర నిప్పటికిఁ గాన వచ్చుచునే యున్నది? ఆపుల
యప్పు మీననయనల తరుణాంతఃకరణాంధంకరణమ్ము
లగు దృక్కోణమ్ముల నూతఁగొని పంచబాణుండు తన
ప్రాచీన సూనశరంబుల నూనుతలఁ బుజ్జగించెను. అంచము
లగు సందెల మొరపంబులకు డెందము లానందముఁ
జెంద నందలి మంద యానల సుందరగమనంబు సవ
రించుకొన నెంచియో యంచ లెడబడక నుంచి సేసికొని
తిరుగు చుండును. అప్పాట భేదనంబునఁ జటులాలకలు వలగ్న
సాదృశ్య వాంఛా విమతంబగు సంబరంబుఁ బయోధరో
త్సేధంబుల నిరోధించు చుందురు. కాఠిన్య కౌటి ప్ర

కార్శ్యంబులు మాత్ర మచ్చటి మచ్చెకంటుల కుచ కచోదర ప్రదేశంబుల యంద పాదుకొని యుండి స్థాన బలంబున నేరికిఁ దీర్పరాని వయ్యె, ననేక ధన దాశ్రితయగు సంపదకును తచ్ఛాఖానగరి నధిష్ఠించిన విరూపాక్షుండు నైత మలకాపురమునే నాఁడు దల పోయని సౌఖ్యంబు ననుభ వించుచుండె. 22

తే. ఆపురంబునఁ బురుహూతుఁ । డమరనగర
మందువలె ననవద్య ప । రాక్రముండు
బుక్క భూమీశ్వరుండు పెం । పెక్కనుండి
లీల భువిదివిఁబోలెఁ బా । లించుచుండె. 23

తే. ఆ స్వజనములకభ్యుద । యంబొసంగు
భూమిచేతఁ బ్రభూతమా । నీతిచేత
మహిమల నావిర్భవించిన । మనువటంచు
మానవావళి తలఁచె న । మ్మనుజవిభుని. 24

తే. సకల పురుషార్థములయందు । సముఁడయ్యైన
ధర్మమును మెచ్చెఁ బురుష స । త్తముఁడతండు
మూఁడుగొనములలో నాది । పూరుషుండు
సత్వము బహూకరించిన । చాయఁబోయి. 25

క. శ్రేయోవాప్తి సముత్సుకుఁ
డాయతి ఘనుఁడతఁడు సొమ్ము । లనఁదలఁచెనుమా
నాయకుపాదుక మాళికిఁ
జేయికి దానంబుసూక్తి । చెవికినటంచున్. 26

ఆ. మలయ వింధ్యనగము । లలబోహణాంతాద్రు
లావరించియున్న । యవనిలోని
యధిపులెల్లఁ గంపి । తాహితప్రాణుఁడౌ
నతని చరణసీమ । నతులఁ గారె. 27

ఉ. ఇష్టుల కిష్టపూర్తిగ న । నిష్టులు నష్టముఁ జెందఁ దుష్టిమై
శిష్టులు నల్లసిల్ల నవ । శిష్టుల కర్థ్య ఫలంబు సేకుఱన్
గష్టము వాసిభూసతి సు । ఖంబొసఁగంగ సుధర్మముంచనా
విష్టమనస్కుఁడై యనుభ । వించె నృపాలుఁడపారభోగముల్

క. హరికిం గమలాలయ శం
కరునకుఁ బార్వతియుఁ బోలె । ఘనుఁడా పృథివీ
వరునకు దేవాయియనం
బరగు పరమసాధ్వి దేవి । పదమున వెలయున్ 29

తే. తారలిశర లుదార లెం । దఱు కలిగిన
నానిశాపతి రోహిణి । నల్లు తవిలి
వసుమతీపతి యల దేవి । ప్రతిభ మెచ్చి
భావమిడి సేసె బహుమాన । పాత్రముగను. 30

శా. ఆకర్ణాట జనేశుఁ డిట్టి విధుం । డా రాజమార్తాండుఁ డ
ట్లా కల్యాణి మనం బెటింగి కొలువ । న్వర్తించి సౌఖ్యంబులా
యా కాలంబుల నాదరింపుచు సమ । ర్థ్యంబైన తీరొప్పను
శ్రీకంబవ్విజయా పురం బధివసిం । చెం బూర్ణ చేతస్కుఁడై

తే. ప్రథమసృష్టి జగత్త్రయో । ద్భవ నిదాన
మైన విధి తేజముం దాల్చు । ననువున నల

బుక్కభూపాలుసతి గర్భ । మును వహించె
వంశమెల్లెడ లల్లి ని । ర్భరముగాఁగ. 32

తే. అల్ల శశిబింబమున వాన । రాంతమందు
రహిత రాజీవమైన శా । రద సదివలె
శరవిపాండురమైన యా । స్యమునఁజిక్కి
రత్నభూషా వియుక్తయా । రాణివాలిచె. 33

తే. గర్భతలమున నలరారు । సర్భకునకు
నేలఁ బాలించు శీలంబు । నేర్పనోకొ
మృత్తికా స్వాదమందలి । మేలి చవుల
నభిలషించెను పార్థివు । నతివ మిన్న. 34

క. సుతుఁ డీ నృపతికిఁ బొడమెడు
నతి లోక భుజాపదానుఁ । డని సతతంబుఁ
నుత వీర రసాత్మకమగు
క్షితి పతి సతి దౌహృదంబ । చెప్పక చెప్పెఁ. 35

ఆ. సుదతి సవిధగతయు । సుల భావగాహయా
దుంగ భద్ర మెచ్చు । త్రోవఁ బోవఁ
దలఁచె నాత్మ సైన్య । దంతి దంతురితయా
తామ్ర పర్ణిలోనఁ । దాన మాడ. 36

మ. అల సత్వంబున నంత సంవిచరమా । త్రైకార్భకం బొక్క తా
చల పర్యంతముఁ బోవ నోపద సము । త్సాహంబు దీపించున
ట్లల మీా నేత్రుణి యాక్రమించు మదితో । నాఖేట రాగంబున
న్మలయక్ష్మాధర ఖేటకూట తటుల । న్మాద్యన్మృగేంద్రంబులన్.

తే. దైత్య నాథుల నడఁగింపఁ । దలఁచి మున్ను
పౌరుషము నాదరింపని । పరమ పురుషు
కపట నటనము లాలించి । కలికి మిన్న
మదిఁ దలంచెను వాని వా । మనుని గాఁగ. 38

చ. పృథివి రథంబు సారథి వి।రించనుఁ డశ్వములాగమంబులం
బుధిదొనపాపరాగొనయ।ముంబిగియించినమేరుభూధరం
బ ధనువు శౌరి శాత శర।మై తనకబ్బిన మూఁడు పట్లలే
విధమని కాల్చె నంచు నలి । వేణి నగెం బురవైరి చేతకున్.

తే. ఉవిద యంతంతఁ గార్శ్యమ్ము । నుజ్జగించు
నంగములచేత ముగ్ధాల । సాక్షమైన
మోముచేత వళిత్రయ । ముక్తమైన
నడుముచేత నృపాలు నా । నందవెట్టె. 40

తే. తరుణి సౌభాగ్య గంధేభ । దాన రేఖ
యైన నవరోమరాజ దా । నలరె లోన
దాఁగి యున్నట్టి తేజోని । ధానమునకుఁ
బైనఁ గాపున్న కాలస । ర్పం బనంగ. 41

క. శ్యామాయితముల మొగములఁ
దామరసేక్షణ కుచ ద్వి । తయము జయించె
న్నోమ్ముల నీలోత్పలముల
నాము కొనిన కోక యుగికి । నాసోయగముల్. 42

తే. మహిత జలగర్భయగు మేఘ । మాలవోలె
విధృత చంద్రాంతరాల యా । వేలవోలె

లీనమణి మధ్యయగు శుక్తి । లేఖవోలె
నలరు సతి గుర్విణిం జూచి । యతఁడువొంగె. 43

క. పరపరితాపహరుఁడు దాఁ
బురోహితోక్తి ప్రసక్తిఁ । బూర్ణాంతరుఁడై
నరపతి తగుతఱిఁ బొనరిచెఁ
బహుహర్షాను విభూతితోడఁ । బుంసవనాదుల్. 44

సీ. అంతఁ బ్రశస్తమై । నట్టి వాసరమున
జ్యోతిర్విదులు మిన్ను । సూచుచుండ
గ్రహపంచకం బుచ్చ । రాశిగతంబుగా
సమలగ్న పుష్కరాం । శమ్ము నందు
నల మహాసేను మ । హాదేవుసతివోలె
నందనుం గనె నర । నాధుపత్ని
పొంగిన దుగ్ధాబ్ధి । పూరంబులం బోలు
నాశూరు కీర్తి మ । హా జలములఁ

తే. గడుగఁబడువాని వలెకడ । ల్కలి మిఁగాంచె
వాని వశమున వర్తించు । వసుధ నెఱిఁగి
దరమున నో తత్పరాగంబు । చారిఁబోక
కల్పసుమగంధి లంబయి । గాలివీచె. 45

తే. అప్పుడు దక్షిణ దేశంబు । లందుఁగూడ
నధ్వరములందు హవ్యంబు । లమునుబెంచి
లలిఁ బ్రదక్షిణ తార్చిఃక । లాపుఁడగుచు
హర్షమున నాడినట్లుండె । హవ్యవహుఁడు. 46

క. మందారాద్రిద్రుమము ల
మంద నిజయశః పతాక । మూయించునో యీ
సంకసుఁడని సంధికిన్నై
ముందుగ సుమచయములిచ్చి । పుచ్చె మొగిళులన్ 47

వ. అంత నజిరముల యందలి విజయ గజేంద్రంబు లుద్భిన్న గండస్రుతదానధారంబులై స్వవిపక్షంబులగు మృగేంద్రంబుల మృగయాత్రల నిమ్మహావీరుండు సంహరించు నను హర్షాతిశయంబుననో, మిన్నుముట్ట గర్జించుటయు నచ్చోటఁ దలయెత్తి యిమ్మహాపురుషు నుపవాహ్యత్వమ్మొనసి మొనలేనికీర్తి సంపాదింపఁ గలమను తలపోతనో, చటులములగు ఖురపుటముల నేల మట్టవియు నుల్లేఖించు వాహంబుల యౌత్సుక్యంబుతో నెల్లెడలఁ బాఱి చారణ చాటువాద ప్రసారితంబును మంగళతూర్యనాద ప్రస్తావితంబును, పౌరజన ప్రహర్ష సంపాదితంబునగు కోలాహలం బను పాలవెల్లిం దేలి యమృతాయమానమై శ్రావక శ్రోతృజనంబుల నవలంబించి దోలావిహారం బనుభవించుచు నక్కాంతల భూకాంతు శ్రవణాంతికంబుఁ జేరి సుఖాయమానయగుఁ గుమారజననవార్తకు నీయరాని యర్థం బా విషయంబున లేకుండెఁ గౌతూహలం బా భూతలేంద్రు నాత్మప్రదానంబునఁ గూడ సంజాత సాహసు నొనరించె నప్పు డప్పుడమితేని యాన విశృంఖలలై సరిపడనివారి పడతులు బందీభవిష్యత్తురుపక్ష పుష్కరాక్షీ నివహంబుల కవకాశమిడ నన్నట్లు కడు

వడిఁ గారాగారంబుల నుండి వెడలిరి. అనంతర మమ్మ
హీజాని స్నాతానులిప్తుండును, ధౌత దుకూల ధారియు,
భూరిద్రవిణ వితరణ సమారాధిత క్షమాదేవుండును,
తనయాననావలోకన మనోరథో పరిప్లవమా నాసమాన
హర్షోత్కర్షుండునై, బురోహితునితో నంతఃపుర ప్రవేశం
బాచరించి, యాభ్యంతర దీపప్రభల నడుగునఁ బడవైచి
కుంకుమపుఁ బొడిజల్లిన వడువున మాటిమాటికి నెల్లెడల
నల్లుకొను గౌరములగు తేజోంకూరంబుల నరిష్టంబు
నావరించువానిఁ, బల్లవ పాటలంబగు పాణిద్వితయంపుఁ
బిడికిలింతలచేత సరాతీందిరా కేశపాశాకర్షణం బభ్య
సించు చున్నట్లున్నవాని, నాలక్ష్యరేఖామయ శంఖచక్ర
ఛత్రారవింద ధ్వజమీన చిహ్నంబులై, సుజాత పార్ష్ణి
భాగంబులగు పాదంబులఁ బవడంపురంగు హంగునఁ గనుం
గొనఁ దగు నంగుళుల వహించువానిఁ గలికాలంబునఁ
గూడ నిదియొక యసురాంతకు నవతారాంతరంబని వివ
రింపఁ జలింపని సిరిమెఱయు జలదరేఖయుం బోని శ్రీవత్స
ముద్ర వత్సంబున ధరించువాని, సమోన్నత నాసికకిసు
గెలఁకుల విచ్చిన తామర రేకులంబోలి నిడుపులగు కనుల
కలిమి ప్రతిబింబించిన సొంపునక మెసఁగు ముగ్ధస్మితాంకం
బగు మొగంబున సంపన్నత్వంబు వివరించువాని శర
త్కాల కృశయగు శైవలిని తరంగంబున లగ్నంబగు
కలహంస శాబకంబుం బలె క్షామశరీరయష్టియగు నద్దేవి
యుత్సంగమున సంగతుండగు వాని నక్కుమారుఁ దిల

కించి తదవ్యాజ సౌందర్యంబు సంభావించు భాగ
ధేయంబు చిరకాలంబునకు లభించెనని ముహూర్త
మాత్రము నిష్పందదాక్షి పక్ష్ముండయ్యెను. అంత నంత
రాయమగు నానంద బాష్పోదయోపరోధమ్మున నంతర
మ్మున నిబిడీకృతమగు హర్షావేశంబునఁ బ్రణున్నములై
నట్లా భూనాథు మేనఁబులకప్రరోహమ్ము లుద్భిన్నంబు
లయ్యె, నట్లు ప్రతీతమ్మగు వాసరమ్మున నన్నరేంద్ర
కుమారుండు పురోహితునిచే సంపాదితమ్ములగు జాత
కర్మాది సంస్కారమ్ముల సమిద్ధతేజుండై మంత్ర ప్రణీ
తమ్మగు మఖానలంబుం బురుడించె. 48

తే. ఎల్లపగతుల నాజి ని । య్యేకవీరుఁ
డోర్చి కంపింపఁజేయు స । ముద్ధతినను
దనవినిశ్చయమున దీర్ఘ । దర్శిఱేఁడు
పట్టికిం బేరువెట్టెఁ గం । పనుఁడటంచు. 49

క. ఆనృపతి యాప్తధాత్రుల
నానిసువుం బెనిచెఁ బ్రీతి । నాహుతులన్వై
శ్వానరుని యజ్వవోలెఁ
గానల సస్యంబు నఁబు । వాహుఁడువోలెన్ 50

ఉ. ఆడటనకుమారుఁడున । వాభ్యుదితుండగుచంద్రుఁబోలిస
మ్మోదమపాదుగాఁ బెరిగి । పూర్వచిరార్థిత తన్మనోరథల్
దాదుల తోడ నేర్చినస్ఖ । లత్పద మంథర వాగ్గతంబు ల
త్యాదరవృత్తిఁగాంచివిని। యానరనాథుఁడుచెందెనిర్వృతిన్.

శా. ఆలక్ష్యాంకురదంతదంతకమనీయంబాత్తసౌగంధ్యమా
బాలోత్తంసుని యాననంబు రుచినాస్వాదించుచున్మోదినీ
పాలుం డింద్రియపాళిమేలి తృషఁదీర్పంజాలఁడయ్యెన్నగ
త్మ్యాలోకాంచిత నూతనోద్యదరవింద ప్రాపిహంసస్థితిన్.

తే. హారములు చందనములు కర్పూరభరము
లల్లయమృతాంశుసంశుచయములుఁ గూడి
యినుని యొడలికి నేనాఁడు నీయనట్టి
సౌఖ్యమును పుత్రగాత్రసంస్పర్శ మొసఁగె. 53

తే. కృతకలారావ కాంచన కింకిణీకుఁ
డై గృహాంతరమందుఁ బారాడు తనయుఁ
గాంచి తలిదండ్రు లమృతసాగరమునందు
మగ్నులైనట్లు లెనసి రమందసుఖము. 54

క. జననాథుపత్ని యొగిఁ గం
పన సంగమనాములం గుమారులఁ గాంచెన్
వనరాశివీచి రేఖిక
మును సురమణి పారిజాతములఁ గనినఁ గతిన్. 55

క. ఇనతనయుఁ డతఁడు దినదిన
మునఁ బెనుపు వహించెఁ జంద్రముఁడు జోడుగ స
య్యాన జులతో నానందం
బునఁ గనుఁగొనఁ దవులు జనుల పున్నెంబులతోన్. 56

తే. మూఁడు కన్నులతో శూలి పోల్కిఁ జెడని
శక్తులన్నింటితో నీతిచాతుఁ ద్రిపురు

షాఢ్గములతో భవము భంగి । నతిశయించె
ముగురు కొమరులతో బుక్క । భూవిభుండు. 57

మ. ఉపనీతుండయి రాజసూతి తతితో । నుద్వేల విద్యావలి
న్నిపుణత్వమ్ము వహించెఁ దాన గురుసాన్ని । ధ్యమ్ము
నన్నేర్చెఁ జా । ప పృషత్కాసి గదాది శస్త్రములఁ భా ।
స్వద్దండనీత్యాది త । న్నృపశాస్త్రంబులఁ బాటవం
బెనసె ని । ర్ణిద్రప్రచారంబునన్. 58

ఉ. సత్యము పల్కు భూరిబల । శాలి ధనుర్ధర పుంగవుండు సం
స్తుత్య హయాధిరోహణుఁడు । శుద్ధకృపాణకళా ప్రవీణుఁ డీ
పత్యభిజాత వర్ధనుఁడు । బాపురె యైక్యముఁ గన్న యుప్పృథా
పత్యచయమ్ము టంచు నొక । వాక్యముగా ననియెం జనమ్ములన్.

తే. మదన సమద ద్విరద మాఁడు । మడువు పుడమి
పడఁతి ప్రేముడి తీవ వె । ల్వడిన పూల
గుత్తి కాంతేక్షణ చకోర । కుముద బంధు
వైన తారుణ్య మొగివాని । నాక్రమించె. 60

తే. మలసి మంచెడలించు నా । మని బలమున
దినకరుఁడు తీవ్రకరుఁడైన । తీరున నొగి
బాల్యమును నిరసించి యౌ । వనముఁ జెనయు
విభుని మైదీవ యొప్పారు । విప్పుఁ గాంచె 61

తే. వాఁడు పర్వతకందరా । వాసతలము
లాత్మ సంగ్రహ ణానుగ్ర । హార్థులైన

కరులు వెట్టిన యరివోని గతివిలాస
ముల ధరించెను భూమ శే ముషిఁ దలంచి. 62

క. పంబిన గర్వంబునఁ శా
దంబున మహాజయ పతాకఁ దన్నక యున్నం
డం బెనయువాని చరణ త
లంబున మీనాంక మేల లక్షిత మయ్యెన్. 63

ఉ. స్థూలశిలా నరా లమల శోభనమూర్తి సువర్ణ మేఖలా
కీలితమా కటిస్థలము గేరె లసన్నవ ధాతు పట్టికా
శాలి మహాంజనాచల వి శాల నితంబ తలంబు నప్పుడు
త్తాలములైనభావినుల తాల్మ్ములడంచెడుకోర్కులంతగాన్.

తే. విక్రమంబున కోడి ని ర్విణ్ణములగు
మృగపతుల యప్పనంబున మేల్మిఁ గన్న
వృత్త తనుమధ్యత వహించె నత్తరుణుఁడు
మేని యందమునకై నది మేల్మి నూపె. 65

తే. ఉల్లసిల్లెడు వాని పే రురము లలిఁగ
వాటమనవాటమై మద వతుల సమద
కుంభి కుంభానుకారియా కుచయుగంబు
వెలిఁబడక యత్తమిల్లెడు వెరవు తోడ. 66

తే. దీప్ర రక్తాంగుళికము ప రు ప్రకోష్ఠ
మంస మాంసల మతి పరి ఘానుకార
మై మనోహర మైప య య్యతుల తేజు
జానువుల నంటు కైదోయి జనము మెచ్చె. 67

సీ. అంతరంగమువాసి । యంక రేఖకచుట్టుఁ
బంబిన శీతాంశు । బింబమైన
నుపమాన మగుచు ద । నోదితశ్మశ్రుస
శ్రీకమౌ తన్ముఖా । మృతకరునకు
న ప్రతి హతమౌ ని । జప్రచారమునాగు
శ్రుతులపైఁ బొడమిన । నోషమనఁగఁ
బూచిన తామర । పూసరులం గేరు
కన్నులకడల రా । గమురహించె

తే. తుంగ మాయతియుతము బం । ధుర మనల్ప
ణంబునగునాస నిశ్శృంఖ । లంబులగుచుఁ
శాలునేత్రము లొండొంటిఁ । జీఱుకుండ
ననుచు నర్గళమనన య్యె । ననిరి కవులు. 68

క. సాంద్రాను రాగరంజిత
చంద్రముఖీ హృదయపద్మ । సంశ్రితమన భూ
మీంద్రసుతు హల్లకాంచిత
యింద్రశిరోరుహచయంబు । రుచికముమించెన్. 69

తే. పడసె నున్నతిమై ప్రతా । పంబుతోడ
యమలినంబయ్యెఁ గన్గవ । యసముతోడ
గ్రీవగుణతతి తోడఁ బ । రీతయయ్యె
నాశయముధ్వనితోడ మ । హత్వమొనసె. 70

సీ. వర్షాగమము రత్న । భరితమౌ జలనిధి
నంచితా పగలతో । నించునట్లు

జనపతి యుదిత యౌ । వను నందనుం గూర్చె
నంద్య రాజన్య క । న్యకలతోడ
శక్రున కాశచి । శార్ఙ్గికి నిందిర
శంభుమూర్తికి గిరి । జాత వోలె
నతనికి దేవేరి । యననయ్యె గంగ యు
నంగ రాజకన్యక । జగము మెచ్చ

తే. నా నృపతి సూతి యౌవన । నాభిరామ
యైన సుందరితోఁ గూడ । ననుభవించె
నోలి ననోన్య హార్ద ర । సోత్తరంబు
దివ్య సుఖమని ప్రమోసె భూ । దివిజకోటి. 71

క. మిక్కిలి వినీతుఁడే యగు
నక్కుశునకు నరాతి మథన । మం దెలియింపన్
బుక్కవిభుఁ డర్థరంజిత
మొక్కతఱి న్వాఙ్మయంబు । నుపదేశించెన్. 72

తే. యౌవన విజృంభితంబగు । నాతమంబు
జనము లుపదేశ భవము ప్ర । జ్ఞా ప్రకాశ
మెనసి పోఁగొట్టఁ జాలెద । రనయ మట్లు
గాన నా సూక్తి యిది తండ్రి । పూని వినుము. 73

తే. గురుని యుపదేశమనఁ జెప్పు । దురు విబుధులు
రత్న కుండల మొండక । ర్కశ మటంచు
నైల్య మెఱుఁగని నూత్నాంజ । నం బటంచుఁ
దాప మొడలికి నిడని స । త్తప మటంచు. 74

తే. అనయముం గ్రమ్మ మదమునఁ । గనులు మూసి
రజము పై కెక్క స్తంభ ని । ర్బద్ధ వృత్తు
లై మలినములు గజము లె । ట్లట్ల హీన
మతులు గొనరు నియంత చో । దితము సతము. 75

చ. స్ఫుటితమదాంధకారము ప్ర । బోధసుధాంశుని మాటు
వుచ్చు న । ప్పటి నడురేయి మానస భ । వప్రమదద్విపః
వై జయంతి సం । కట దశ దేహ ధారులకుఁ । గాదన రానిది
యౌవనం బెవం । డటఁ జననేర్చు వక్రత య । హంకృతి
శాఠ్యము లేక యక్కటా ! 76

తే. దయ యనుజలంబుఁ ద్రావెడు । దారుణోష్మ
మల యహంకృతి తరువున । కంకురంబు
తమమునకు మూలమౌ ప్రదో । షము తరుణిమ
చొప్పడినఁ గన్నుఁ దిన్నగాఁ । జూడనీదు. 77

ఉ. యౌవన మంకురించిన న । యాగమపుం గ్రమముం
దలంపకే । కావరమెచ్చి సంపదధి । కార మదోద్ధతుఁ
డైన రాజు నెం । తే వడిఁ దామసత్వుఁడ । యుందుని వోలె
తుఱుంపఁ జేయు నా । నావిధమౌ మహాపద య । నారత
ము న్వ్యసనానుబంధమై. 78

ఉ. కామిత సాహసాచరణ । గాఢధురంధర లంగజాత మా
యామయ భృత్యశస్త్రిక ల । నర్థపరంపర లున్మదాంధచే
తోమృగబంధవాగురలు । దోషమయాంకురకుంజభూములా
భామలు బుద్ధిమంతులగు । వారలు వారల విశ్వసింతురే. 79

తే. అక్షయంబగు బలము మ । హార్హ రత్న
భాసురమ్ములు సొమ్ములు । పంటచేలు
నాలుబిడ్డలు నిన్నియు । నేల? తండ్రి!
మొదలితోఁగూడ జూదరి । యొరులధనము. 80

క. జీవిత సందేహాకరం
బౌ వేట వినోదబుద్ధి । నఫలమగుట సం
సేవింపఁ దగునె దుర్మద
భూవర గజములకు వారి । పోయిదిపుడమిన్. 81

చ. అనయము నిండు జవ్వనపు । నాప్తి మదించి విశిష్టభూతి
యం । త్రణమునఁ ద్రోవఁ దప్పి మది । దారసమానుట
మూఁడు దోసముల్ । తనరు మహోజ్జ్వరంబునను । దయ్య
ము వట్టిన వానిఁ బాము ము । ట్టిన గతికాదె యన్నడ
న । డి న్మది మెచ్చెదరే విచక్షణుల్. 82

తే. రోష పరుషాక్షరముగ వా । క్రుచ్చు ఱేఁడు
మంచిసేసియుఁ బ్రజకు స । మ్మతుఁడు కాఁడు
జలము గురియుచు నున్న భీ । షణుఁడ కాఁడె
పిడుగు వడునట్లు కడు నుఱు । మెడు ఘనుండు. 83

తే. ఎవఁడు తన సంపదల కెల్ల । నిల్లనంగ
నమరు రాష్ట్రింబుఁ గలిగ దం । డమున నలఁచు
నట్టి దుర్మతి తా నెక్కి । నట్టి చెట్టు
కొమ్మ నఱుకఁ గుఠారంబుఁ । గొనెడు నతఁడ. 84

ఆ. ధర్మసాధనములు । ధనములు దుర్బుద్ధి
యొవఁ డపాత్రములకు । నిడు మదమున

నతఁడు నవనయోగ్య । మైన హవ్యముఁ జితా
వేశ్మ వహ్నిఁ బాఱ । వేయుఁ జువ్వె. 85

తే. ఆహతాంగము లైశ్వర్య । దేహ యత్న
ములు ననందగు వ్యసనము । ల_లఁచి యాడ
నలసులు తమోభిభూత ని । జౌజులగుచు
నెదిరికి నుపేక్షణీయు ల । య్యేదరు సొరిది. 86

ఉ. ప్రోత గుణానుషక్తి నుప । భోగ మొనర్చుటచేతఁ గాక భా
గ్యాతిశయంబునం దమకు । నబ్బిన పువ్వులదండఁ ద్రెంచు నా
క్రోతులు వోలెఁ బన్నములు । కున్నలమైన మహావిభూతిఁ జే
సేత నడంత్రు దుర్మద వ । శీకృత చిత్తులు చాపలంబునన్. 87

వ. పుత్రా! ఇయ్యది గతానుగతికంబగు లోక వృత్తంబు నీ
యట్టి ప్రాజ్ఞులు తాన పరిపూతయు గురూపదేశంబునఁ బరి
పూతతరయు వ్యసనానుబంధ నిరాసంబునఁ బరిపూత
తమయు నగు ప్రతిభతోఁ బరికించి మంచిపను లొనరించి
పేరుఁ బెంపు సంపాదింపఁ జాలుదురు కాన నాయీ యుప
దేశంబుఁ జిత్తంబున నిలిపి ధైర్యంబున బుద్ధిమంతుండవగు
నీగుణములచే నిబద్ధయై స్వభావ చంచలయగు పద్మాలయ
యేనాటికిఁ దొలఁగని నిలుకడ నెనయు నట్లాచరించు
కొనుము. తండ్రీ! క్రమానుగతులై పనులు సేయుచు
మచ్చరంబులేక జవ సత్వంబులు కలిగి వైరి స్వాంతంబుల
సంతాపింపఁ జేయు జగతీపతు లస్మదనుశాసనంబున నిర
స్తమదులై యిప్పుడు నిన్నుపచరించుచున్నారుకదా!
కుమారా! ఉత్తుంగ తురంగ తరంగసంగతంబులు,

మ త్తేద్విప మహోద్విప పరిష్కృతాంత రంబులు నత్యు
గ్రాయుధగ్రాహ నిబిడితంబులు. ఇహలలములగు బల జల
ధులు నీన్నెల్లప్పుడు సేవించుకొను చున్నవియు. ఆయావిధ
ముల నుజ్జృంభిత భూరిపౌరుషుండవు ననహాయ శూరుండ
వునగు నీవు న శేష జగదుపద్రవ కరంబులగు భూధరం
బులపై నోషుణుండగు వృషుండు శాతంబగు శతారంబునుం
బలెఁ బరుల యెడఁ బరాక్రమం బుపయోగింప నర్హుండవు
కావునఁ దుండీర మండలం బధిగమించి యఖండితోద్యమ
పరుండవై రణోన్ముఖులగు జంప ప్రముఖుల నిర్జించి నిధి
పతివోలె ననువర్తిత రాజప్రజుండవై యలకాపురిఁ బోలెఁ
గాంచీపురి ననుశాసింపుము. ఆటవికీ సేనాటోపంబు
నివారించుచు ననివార్యుండవై నడచు నీకుఁ దురుష్క
నిష్కాసనము దుష్కరము కానేరదు. వెంట వెంట
నంటి కొను కొనకొమ్మల లిమ్ముగ నున్న దవానలుండు
తరు ప్రకాండంబు నిర్దహింపకుండునే? దక్షిణ దేశముల
నాక్రమించి యున్న వీనిచే రాక్షస రాజ దుర్నయము పరి
పాలింపఁ బడుచున్నది నీవును ముల్లోకముల యడరు లడఁ
పఁజాలు నిర్మలమగు రామ భూమిక నీవ ధరించెదుగాత!
మని కురిసిన వారిదంబు చందంబున నన్నరేశ్వరుం డూర
కుండుటయు గుణవంతులలో వెనుకంజ యిడని యక్క
లోద్వహుండు గురూప దేశప్రజంబు శిరసావహించి నమ
స్కరించి పూజించెను. తరువాత తన యొడలినుండి తీయ

బడిన యమూల్యములగు సొమ్ములతోఁ దండ్రిచేత నలం
కృతుండైన యమ్మండలాఖండల కుమారుండు మఱు
నాఁడు చైత్రయాత్రోత్సవము నిశ్చయించి సంతోసముతో
నంతఃపురంబుఁ బ్రవేశించె.

తే. అంతఁగా బోవు భూభార । హరణ మురగ
నాథునకుఁ దెల్పఁ బోవుచు । న్నాఁడనంగ
గాఢ రంహస్కమగు రథ । గమన మొప్ప
వాసరేశుఁడు పాతాళ । వసతి కేఁగె. 89

శా. ఆరాట్కాంతి యనంతరంబ తగ సం। ధ్యాకార్యముం దీర్చి తా
నా రాజన్యుల కుత్సవంబుఁ బలె గు । ర్వాజ్ఞన్నివేదించి వీ
రారాత్యున్మథనోత్సుకాత్ములగు న । ర్యాత్మజ్ఞులం బంచి స
త్యారంభుండు సుఖించె నంతిపురిజా । యాంశోభనాశంసలన్.

శా. శ్రీనారాయణభట్టసంజ్ఞిత మహా । శ్రీశ్రీనివాసాభిధే
యానూనార్థవిచక్షణాధిగత వి । ద్యాతంత్ర తత్త్వార్థసం
ధాన ప్రస్తుత మానసాబ్జసుమతా । త్పర్యస్థిరాతంద్ర కా
శీ నాథాభిధ బంభర ప్రవర శే । షీభూత భావాశ్రయా. 91

క. స్తుతబాదరాయణాసూ
త్రితమీమాంసాటవీద్య । దీక్షితసువ్యా
కృతనీలకంఠభాష్యా
తతపదవీచరణవిరచి । తవ్యాసపథా. 92

మాలిని.

భరితనియమముఖ్యా । ధ్యానయోగానుయుజ్య
ద్గుణతరమహిమాఢ్యా । ఘోరనాథాభిధాంచ
ద్ధరసమధిగతజ్ఞ్వా । లాంబికానామభాస్వ
త్సురసరిదుదరశ్రీ । శుక్తిముక్తాయమానా 93

గద్యం.

ఇది శ్రీమదుమామహేశ్వర చరణనళిన నిత్య సేవాసమా
సాదితానవద్య కవితాయోగ హృద్య మహితాత్రేయ
గోత్ర పవిత్ర హనుమత్సుధీతనయ విదితనయ లక్ష్మాం
బాగర్భశుక్తి ముక్తాఫలాయమాన వేంకట
కవీంద్రాత్మజ త్వానూన హనూమాంబా
శమీగర్భ హావిర్భుజాయమాన శ్రీదేవీ
సేవ్యమాన రాఘవ నారాయణాభి
ధాన ప్రణీతంబైన
మథురావిజయమను
శ్రీ వీరకంపరాయ చరిత్రము నందుఁ
బ్రథమాశ్వాసము.

---



ఓం

శ్రీపరమేశ్వరాయనమః

# శ్రీ మధురా విజయము

## ద్వితీయాశ్వాసము





గౌరీ సమ గుణ గణ
యోగశ్రీ లింగమాంబి । కోర్జితసేవా
రాగార్జిత సుఖపుణ్యా
లీగణనాతీత నాగ । లింగ వినేతా. 1

వ. అవధరింపు మనంతరం బాగంగాదేవి రచన తెలుంగు రంగుగా 2

క. వనభవ వనజీవనదుఁడు
దిననాయకుఁ డఖిలలోక । దీపకుఁ డుదయం
బెనయుటయుఁ జమూపతులకు
జనపతిసుతుఁ డాజ్ఞయిచ్చె । సైన్యముఁ గూర్పన్. 3

సీ. మందరసంఘట్ట । ముం దలంచిపయోధి
మండలం బతిసంభ్ర । మంబునొంద
కల్పాంత సంరబ్ధ । కాళీశడమరుడా
మరరవ మనిమింటి । పౌరలు వెఱల
శతకోటి కోటి ని । స్వనమని భూధరం
బులు గుహాస్యముల వా । పోవుచుండ
వెంటనంటు పరేత । విభు సన్నహనమని
భయవిద్రుతాన్యభూ । పతులుగలఁగఁ

తే. చకితమీలిత నయనుఁడై । సర్పరాజు
చెవుడు గ్రుడ్డియునొకసారి । చెందువాని
చందమొందఁగంగ దిక్కులు । సంచలింపఁ
గోణహతిమ్రోసెను రణప్ర । యాణభేరి. 4

సీ. కడు విశంకటకటా । ఘాటగలన్మద
ఝరము లనేకము । ల్కరటిఘటలు
వాయు రయంబునఁ । బాఱు సైన్యాబ్ధి త
రంగముల ననో తు । రంగమములు
కుంతాసి కర్పణ । కోదండ పాణులు
శూరులు నైకదే । శ్యులు పదాతు
లాయుధాఘూర్ణము । లాబద్ధ పరికర
ములు విఘాతక్షమ । ములు రథములు

తే. నాత్త కుథములు బద్ధప । ల్యాణకములు
భర్మ నిర్మిత వర్మ సం । వర్మితాంగు

లలఘు రథి సారథి సమేత । ములుగఁ బొంత
నమునఁ దద్బల మెల్ల స । న్నద్ధ మయ్యె. 5

క. సుత్రామ తుల్యులగు నృప
పుత్రకు లనువైన వేష । ములు దాలిచి త
ద్గోత్రేశు రాక వేచిరి
యాత్రాకుతుకమునఁ దోరణా । భ్యర్ణమునన్. 6

సీ. సేనా నదీ సర । సిజములౌ గొడుగుల
ననవకాశం బయ్యె । నాకసంబు
ప్రస్థాన శారదా । రంభంబునం బొల్చెఁ
బ్రభు చామరాళి మ । రాళ లీల
మకుట మణిప్రభా । మంజరుల్ రంజించె
రవికాంతి కౌరస । రక్తి నెప్ప
డధిక ధ్వజాకీర్ణ । మగు బాట నడిపించె
నల మతంగ శతాంగ । మరుసఁ డెట్టొ

తే. తురగ హేషా రవంబుల । తోడఁబుట్టి
ద్విరద బృంహితముల నుప । బృంహితమగు
మేలి కోలాహలం బొందు । మిన్నుముట్టెఁ
దూర్య నాద వివేకంబు । తోచకుండ. 7

ఆ. అంత సమయవేత్త । యగు మహీపతి పురో
హితులతో ముహూర్త । మెఱిఁగినదువ
భావి జయరమాత్మ । పరిరంభముం దెల్పె
నదరిపడి యవామ । మగుభుజంబు. 8

తే. అంతట నధర్వవాదులై । నట్టిద్విజులు
సంస్కృత హావిర్భరంబుల । జ్వాలనుసట్ల
జయమహాశీ రవముల ను । జ్వలునిసేయఁ
దోరణాంతికమున కేగి । భూరమణుఁడు. 9

సీ. తన వేగమునకుఁ జా । లని భూమి భాగంబుఁ
గడు విస్తరింపఁ జే । సెడు ననంగ
నొకసారి మాత్ర మొం । ఋదధి లంఘించి గ
ర్వితుఁడైన హనుమ న । వ్వెడు ననంగ
హరిదశ్వ హయుల ఖే । చరతా మదంబున
కెడయాక యిదె యడం । చెడు ననంగ
నెదుట నిల్చిన విజ । యేందిర కతిభక్తిఁ
జెలసి నమస్కరిం । చెడు ననంగ

తే. పనిత ఖుర ఘట్టనము ఫేన । పాండు హేష
మవని ధూళిస్థలీ రచి । తాంబరంబు
గతి నిరోధ వినమితోన్న । మిత ముఖంబు
నై యచటఁ గట్టియున్న హ । యంబుఁ గనిమొ. 10

వ. మఱియు నిజగమన వేగంబున నధఃకరింపఁ బడిన జంభారి తురంగమంబను భ్రాంతిఁ గలిగించు మణి కుట్టిమ లగ్నం బగు ప్రతిబింబంబు నాక్రమించు చున్నదాని, ముఖలీ నఖలీ నాహియు నచ్ఛపల్య యనచ్ఛదంబు నగుట నొడలి తోఁ గూడ గరుడు ననుకరింపఁ గుతూహల పడుచున్న ట్లున్నదాని, లోల వాలాగ్రలగ్నంబగుట రంహోరహస్యా భ్యసనమునకు నంతేవాసిత్వ మధిగమించి నట్లున్న గాలిచే

సేవింపఁ బడుచున్నదాని, మూర్తిమంతంబగు నుత్సా
హంబో! ప్రత్యక్షమగు కీర్తి దేవతయో! తార్క్ష్యస
పక్షంబో! చిత్తము తోఁబుట్టువో! వేగంపు మొత్తమో
యని విచక్షణులచే నుత్ప్రేక్షింపఁ బడుదాని నత్తురంగ
పుంగవంబు నెక్కి యక్కుమార మారుండు నిఖిల భూచ
క్రంబు నాత్మ హస్తాగ్ర గతంబై నట్లు తలఁచి యచ్చటచ్చట
నసంఖ్యాకంబులగు సైన్యసమూహములచే నాచ్ఛాదింపఁ
బడిన వైశాల్యము గలగృహ బహిర్ద్వారంబు నిర్గమించె
నప్పు డానమ్ర కిరీట తట కీలితములగు నంజలి బంధంబు
లతో హయారూఢులగు నరపతులు నమస్కరించిరి. అందు
నందడి జడియుచు వేత్రహస్తులైన చోళ కేరళ పాండ్యా
దులు పాదచారులై జయజయ శబ్ద ముఖర ముఖులైరి.
అభ్రమాలలు శుభ్రములగు నంభోబిందువుల నచలము
పయి వర్షించు నట్లు పౌరపురంధ్రు లాచార లాజ లతనిపైఁ
గురిసిరి. అంత వీరకుంజరుండగు నక్కంప భూనిలింప పతి
వైరి భూపతుల మానసములు కంపింప మేఘమాలఁ
గొంపోవు తూర్పుగాలి వోలె నమ్మహా సేన నడిపించు
కొనుచు, మలయాచల ముద్రితమగు దిక్కున వెడలెను.
మాటిమాటికి నెగయు బరాగముల వలన భూభారము
కొంత తగ్గుటయుఁ బృతనా భారమును ఫణిపతి యతికష్ట
ముగా నిర్వహింపఁ గలిగె నప్పు డయ్యవనీక్షోద సందో
హము వైరిభూరమణుల ప్రతాపాదిత్య కీర్తిచంద్రుల నొక్క
పరిఁ గబలింపఁ దలంచి యుపరాగమయ్యె నెల్లదిక్కుల

శతధా ప్రరోహించుచున్న కంపభూనిలింపపతి కీర్తిలతికకు నవక మొసంగఁ జల్లిన కరీష నికరంబన నరయ్యుఁ గాబోవు యుద్ధమున నమరత్వముం దాల్పఁబోవు వీరులు తన్నుఁ బేరింతురను వెరపునం బోలు శూరున కభయ మొసఁగి యడ్డపడిన యవనిక యయ్యును, దఱచుగ నిదితన్నుఁ జెఱచునని యూహించి గంధసింధురంబుల మదధారాసిరా ముఖంబుల మాటివేయ బెందడి యయ్యు, నష్టకిరణ కిరణ గ్రాసంబున మిక్కిలి నంతస్తంబయినది వోలెఁ జతుస్సాగర జలంబుల నవగాహన మొనర్చియుఁ గరేణుకర శీకర రేణువులకుఁ గరకాకార చాతురి నానోపించియు, వేషధారి నూదిరి కోడసీకుహార రంగంబున నాడి యాడి పిమ్మట సేనాగజేంద్రముల కర్ణతాలానిలముల నాహతమయ్యు, సప్తస్రోతస్రుత ధారా దుర్దినములచే నివారితమయ్యు, మేదినీతల మెల్లఁ దురంగ ఖుర కుద్దాల దళితమైనను ముందున కైన నెచ్చోటఁ గానరాక యడఁగి నంతఁ గల్పాంత సంభిన్న సప్తాంభోనిధి సన్నిభంబు నుత్తాల కోలాహలంబునగు నబ్బలంబు చలంబునఁ జెలంగి క్రమంబున నడువఁ దొడంగె నత్తఱిఁ దమ్మిపూఁదోటల విహరించి తుంగభద్రా కల్లోలంబుల నుయ్యెల లూగి యూగి యనుకూల మారుతమ్ము వెంటనంటి నడిపింపఁ గర్ణాట విషయ మతిక్రమించి యయిదాఱు దినములలోఁ గంటకానన పట్టణమున కేగి యచ్చటఁ గొన్ని వాసరంబులఁ గడపి పుచ్చి, కాలజ్ఞుండగు నమ్మహాబలుండు చంపభూ

పాలు నెదిరింప నుపక్రమించి, వాని కీర్తితోఁ గూడఁ బాలేటి నీటికి తన సేనల వలన కలిగిన ధరాపరాగంబునఁ గాలుష్యంబు సంపాదించి సగుణ మారుతా ధూత ద్రుమంబగు విరించి నగగోపకంఠంబున సేనా నివేశంబుఁ గల్పించి మొన గట్టిసేసికొని ఘనీకృత హిమానీకంబగు హేమంతము భాస్కరుం బోలె ద్రవిడాధిపతి నాక్రమించిన నాతండును సన్నద్ధుండుగాఁ జాతురంగంబుతోఁ జాతురంగంబు యథాక్రమంబున, సంవర్త మారుతాధూత సముద్ర ద్వయముం బోలెఁ దలపడినఁ బోరు ఘోరం బయ్యె నంత.

క. వీరవర సింహనాద వి
హారంబులు దుస్సహంబు లగుటయు నాశా
వారణములు విరచిత ఫీ
త్కారములై మూర్ఛమునిగెఁ గలఁగి పలుమఱున్. 12

శా. ధానుష్క ప్రవిముక్త శాత శరము ల్గాకె న్నమి ద్దేవతా
మానాపాంగ విలాస భాసురత న న్యోన్యంబు నత్తాకున
న్సేనోద్ధూత మహారజస్తమమున న్నిస్త్రాస్త్ర సంఘట్టనో
త్థానంబు ల్చెలసెన్ స్ఫులింగములత ల్తద్ద్యోత జాతద్యుతిన్.

స్రగ్ధర.

రక్తోత్సిక్త ప్రవీర ప్రసర దసిలతా ప్రస్ఫురన్మృత్యు జిహ్వా
శక్తి ప్రచ్ఛిన్న సేనాజన వదనము ల బ్జ ప్రకాశంబులై త
ద్రక్త స్రోతోవహాళి భ్రమ నెలకొలుప న్సంగదుత్తుంగ భంగా
భుక్తింబొ ర్లాడుభూభృద్భుజముల భుజగీబుద్ధి గృధ్రంబు లానెన్

మ. అచలాకారముల్తాకరీంద్రకరహా। ర్యాగ్రంబులందుండిరా
త్రిచరస్త్రీచయముల్ప్రమత్కృతిగఁ బొం। దెన్ రక్తమాంసంబు
లన్। నిచితార్యస్త్రులు కుంభికుంభములపై। నిద్రించిసారాం
గనా। కుచకుంభంబుల యందుఁ దత్తరణమ మే। లోర్కెలంది
రందంబుగన్. 15

క. అంతట బావలు బలోన్నతి
మంతులు కంపావనీంద్రు। మాన్యభటులు వి
క్రాంతులయి వెంటనంటినఁ
దాంతంబగు ద్రవిడ బలము। తడబడి వాఱెన్. 16

వ. అందుఁ గొంద ఱెగసి యొగసి పఱుఁగిడుచు భయమున
నాయుధంబులుజాఱవిడిచిరి, మఱికొందఱుతలఁచుగా నిఁకఁ
బ్రథన వ్యాపారములం జొఱమని యొట్టు వెట్టికొనిరి,
యింకఁగొందఱు చచ్చినట్లు నేలంబడియుండి,నక్కలు ముట్ట
వచ్చిన భయమున లేచి దిక్కెఱుంగక పేరెము దీయుచుఁ
గర్ణాట వీరులకు నవ్వుఁ బుట్టించిరి, వేఱఁ గొందఱు విక్షే
పింప నెత్తిన చర్మ ఫలకములఁ బ్లవకల్పనము సేసికొని
మృగతృష్ణా తరంగిణుల ఱిత్త యీఁదఁ జొచ్చిరి, పామిత
రులు కొందఱు పఱుగిడుచుఁ దమనీడలఁ జూచి వైరివీరులని
తలఁచి వెఱచి వ్రేలుఁగఱచి నమస్కరించిరి. అంత నయ్యై
రినగరంబు శిబిరం బొనర్చుకొని కంపభూనిలింప నాథుండు
ద్వీపదాశ్రితంబగు రాజ గంభీరంబను గిరి దుర్గంబు నవరో
ధించుటయుఁ దద్దుందుభి ప్రతిధ్వాన ముఖరములగు గంద
రాముఖములచే నది భయపడి యమంద్రముగ నాక్రందించి

యుభయము వేడి ప్రహాతాభి ముఖాఘాతములగు బతాకా పాణి పల్లవములచే నారాజ కంఠీరవు నారోహణార్థ మాహ్వానించినట్లుండెను. అప్పు డుభయసైన్యములకు పతద్ధుత్పత దస్త్రాంశుజ్వలితోర్ధ్వ నభస్థలంబగు నాయోధనంబు ప్రవర్తిల్లె. ప్రాకారమునుండి బాణపాతితములై తాళఫలములవోలె రాలుచున్న వీరవరుల తలలు చూపఱకు జన్యరమా కేళికందుక భ్రాంతి సంతరించె. దుర్గముచే నాతర దానార్థము పంపఁబడిన దూతలవోలె యంత్ర విచ్యుతములగు జాలా నృపాలు పాలఁబడియె. ధనుర్ధర ముక్తశరనికరజ్వలనజ్వలితోర్ధ్వాగార వారంబగు నగ్గిరి వరంబు కట్టాల ఘుంగవు విజయా రాత్రిక శిరసావహించి నట్లుండెను. కుంతాయుధములచే నిచ్చెనలఁ గల్పించు కొని ప్రాకార శృంగాగ్రంబుల కెగఁబ్రాకిన వీరవాహిని యక్కొండ యెల్లనిండి విక్రమించె, నిట్లా దుర్గంబెల్ల నుద్భటభట సింహనాద గలిత భ్రూణ గార్భిణంబును, నిహతాస్ర నదీమజ్జన తాశాస్య జీవితంబును ఘననారాచ సంఘట్టన కారణ వైశ్వానర పచ్యమాన నైకవిధ జీవ లోక త్ర్యోపమిత కృతాంత మహానస శాలంబు నలబ్ధనిర్గ మంబునై యుపక్రమతం బయ్యెనంత. 17

క. అతి కోపనుఁడగు చంప
క్షితిపతి నిజగృహము నుండి । శీఘ్రము ఖడ్గా
న్వితుఁడై వెలువడ వల్మీ
క తటి నిజ్జిహ్వాలము భుజ । గము వెడలు గతిన్. 18

తే. నేను నేనని వీరు ల । నేకు లనికిఁ
దారసిల్లంగఁ గంప భూ । ధవుఁడు గిట్టి
చంపభూపాలు నెదిరించె । సామజంబు
ముట్ట లంఘించు మృగరాజ । పోతమనఁగ. 19

క. ఉచిత స్థానకు లసిధరు
లచలాత్ములు నానిఖుంచి । తార్థాంగులునై
యచలాకృతి వారుండిరి
విచిత్రతర చిత్రఫలక । విన్యస్తులనన్. 20

తే. చాపుకత్త్యా విభక్త శ । రీరు లగుచు
సారిది మండల గతులతోఁ । జుట్టివచ్చు
వారి సౌష్ఠవమెల్ల న । స్వప్నులు గని
మెచ్చుకొని రాత్మఁదమ యని । మేషవృత్తి. 21

తే. కంపరాజాసి పుత్రిక । చంపరాజ
బింబకలితాంతరాళమై । డంబుఁ గాంచె
నప్సరస యిచ్చమెచ్చు నా । యకునిఁ గనఁగ
నంచితముగ నంతర్వ్యత్ని । నైన మాద్రి. 22

తే, అంత నాతని ఖడ్గప్ర । హార మెట్లొ
వంచనా ప్రౌఢిఁ దప్పించి । వసుమతీశుఁ
డసిముఖంబున నన్యుల । కందరాని
యర్చ లిప్పించె సురపతి । కతిథిఁ జేసి. 23

శా. ఈరీతిం దురమందుఁ జంప నృపతి । న్హింసించి కాంచీపురిన్
శ్రీరంజిల్ల జయప్రశస్తిఁ బిత్రశా । స్తిం గూర్చి వర్ణాశ్రమా

చారం బెందుననంకరంబుగనయా । స్థనోన్నంపుఁ బెంపారఁదుం
డీరత్నూన్మతల మెల్ల నేలె నతి దా । న్నిం గంపరాజేశుఁడై. 24

తే. నమితశత్రు బలుం డా ప్త । నందనుండు
ధన్య సుమనో మనః ప్రియ । దాతయైన
వానిఁ జెంది జగంబెల్ల । వసుధ మఱల
నవతరించిన హరియంచు । నాత్మఁ దలఁచె. 25

తే. శక్తియుతుఁడు ఫలోదయ । శాలియుఁ బఱ
బంధముఖ గుణములఁ బెంచు । వల నెఱిఁగిన
నిపుణుఁడగు నావిభుఁడు నవ । నీతి భూతి
ననుభవించె నపాయంబు । లపగమింప. 26

తే. ప్రసృత దీధితి యగు వివ । స్వంతుఁ బోలి
ప్రహిత చార గణుండగు । ప్రభువరునకు
మిత్రమండలములయం ద । మిత్రమండ
లముల యందును లేద య । లక్షితంబు. 27

చ. మృదువుగ రాజు తత్కర ప । రిగ్రహణం బొనరింప సంతసం
బొదవి ధరిత్రి సస్యనిచ । యోన్నతయై పులకించెనో యనం
గదలక దార్ఢ్యశాలి కట । కప్రియ మూర్జిత దానభోగ మా
దదమలదోస్స్థలిన్నిలిచి । తావిడిచెం బ్రథమాస్పదాదృతిన్.

మ. ధరణీశు ల్గజదాన పంకిలముఁద । ద్వారస్థలి న్భూషణ
స్ఫుర దాఘట్టన జాత రేణుతతి సం । శోషింపఁగాఁ జేయుచున్
బరభావంబుఁదొఱంగి ధాతలిపిమా । పన్నాత్మ భాగ్యప్రదా
తురముల్వ్రాయఁదదంఘ్రిపీఠినిడిర । ప్రాంతంబు శీర్షంబులన్.

తే. అనుదినంబును సమయంబు । నరయు నృపుల
కలకలంబునఁ జామర । గ్రాహిణీద్య
వలయ రింఖణ రవములన । వంది పఠిత
రాజ బిరుదావళులు విన । రాక యుండె. 39

సు. చతురాక్రాంతి కలా మనోహర సర । స్వత్యంఘ్రి మంజీర శిం
జిత భాస్వత్కవివాక్సుధారసముల । స్సేవించి రాగిల్లు నా
పతి కీర్తి స్లలితాంగన ల్గమకస । ద్భంగీ తరంగీ కృతో
చ్ఛ్రితవీణాలసమానపాణులయివా । సింబాడిరాసంగడున్.

తే. ఉచిత తాలము సముదంచి । తోరు విభ్ర
మంబు చారు చమత్కృత । మంజిమంబు
ముఖరసోజ్జ్వలమగు నంతి । పురపు సతుల
చతుర నర్తన మీక్షించె । వితత యశుఁడు. 32

క. హత శార్దూలకము పరి
క్షత మహిషము మృదిత కృష్ణ । సారకము నిషూ
దిత సూకర మాసాదిత
మతంగజము సేసెఁ బెక్కు । మాఱులు వనమున్. 33

తే. పరిమళించు హిమాంబు సం । పన్న చామ
రానిలంబులు నవచంద । నాంచిత తను
లతలు మృగదృశలు శశాంక । వతులు నిశలు
మహీపతికిఁ గూర్చ గ్రీష్మ మూ । ష్మలము వచ్చె. 34

ఆ. పగళులయ్యె వికచ । పాటల గంధి లా
నిలములు జలకేలి । నిరత యావ

తములు రజని దీర్ఘ । తాహారంబులు నధి
కస్ఫుర ద్రవి ప్ర । కాశములును. 35

సీ. దైవాత్త దక్షిణా । శా వధూ విరహ తా
 ప నివారణార్థమో । భాస్కరుండు
సంతతంబును హిమా । చల శీతలంబైన
 స్రోవస నడువఁగాఁ । దొడఁగె నపుడు
పరుషమౌ తత్ప్రతా । పంబున వసమఱి
 నట్లు వేగము వాసె । నశ్వ సమితి
చక్రవాక ద్విజ । సౌఖ్యకరంబు దై
 ర్ఘ్యంబుఁ జెందెను వాస । రంబు లోలి

తే. సరస చందన ధరములు । సురుచిరములు
త్రిసర హార ప్రవాహము । ల్తీవఁ బోండ్ల
కుచతటంబులు ఘర్మార్త । కుసుమధన్వి
కుంజరంబునకును ధృతిఁ । గూర్చెఁ గొంత. 36

సీ. జలకేలి కెలయు కుం । తలుల పాలిండ్ల మొ
 త్తుల కెదభీతిలి । తొలఁగెనో యనఁ
బ్రతిదినం బంతఃపు । రంబున దీర్ఘికాం
 తర సలిలంబులు । తఱుఁగఁ జొచ్చెఁ
జిన్ని చెమ్మటల ను । చ్ఛ్రితములౌ మౌక్తిక
 మండనంబుల మంజి । మంబుఁ దాల్చి
నవ శిరీషవతంస । సువదనా వదనమ్ము
 లామోద భరము ని । త్యం బొసంగె

తే. మఱియు రాత్రిముఖంబుల । మల్లెపూలు
ముడువఁగడు సురభిళములౌ । పూవుఁబోండ్ల
కచభరంబులయందు ము । ఖంబుఁజేర్చి
ధీరవరు నెమ్మనం బవి । తృప్తమయ్యె. 37

ఆ. వరవధూ సహితుఁడు । వసుధాధి నాథుండు
పగటితాప మెల్లఁ । బాపుకొనియె
నంబుకణనిరంత । రాదర్శితోడు సం
స్కృతములైన తుహిన । గృహములందు. 38

ఉ. ఆతటి విచ్చుచున్న నిచు । లాగమమంజరి కాళిఁజామర
వ్రాతముగాధరించి తప । వారిధనంబుఁగరంబొసంగుచుం
జాతక యాచకాచరిత । సంస్తవమై జలదాగమంబు ధా
త్రీతలనాథునిం బరిచ । రించుటకై చనుదెంచెనోయ్యనన్

వ. అటునిటు విహరించు విద్యుదంగనల లలిత లాస్యములకై యమర్చిన హరిన్మణిస్థగిత రంగస్థలంబు లనఁ దగె గర్జిత సంపాదిత పటుమృదంగ రవంబులునై నిబిడముగ నావిర్భవించిన వారిదంబులు స్ఫుటతటిత్తపనీయ గుణోజ్జ్వలంబులును, పృథు పయఃకణమౌక్తికసంభృతంబులును భ్రమర కదంబ సచ్ఛవులు నగుదిశాంగనల కంచులిక లనసయ్యె, హరితలోహిత పాండురవర్ణం బగు త్రిదశరాజ శరా సనాకారం బంబరలక్ష్మి ధరించిన మరకతోపల విద్రుమమౌక్తికవిరచితమగు మేఖలవోలెఁ బ్రకాశించె. భూతలమ్మున రుధిరబిందు నిభచ్ఛవియైన హరిగోప పరంపర ఘనఘరట్ట పరస్పర ఘట్టన జనిత దిరమ్మద వహ్ని

కణావళి ననుకరించె. పటు పురః పవనాధిగత భ్రమంబులై జలదంబులు కరకా కైతవంబున సలిలరాశి లోని యుదక ముతోఁ గూడఁ బీల్చిన మౌక్తిక సంహతి నుద్వమించి నట్లుండె నిష్టమగు ఘనాగమంబు నీక్షించి మధుర షడ్జ మనోహరంబులైన సంగీతంబులు వాడుచు, మాటిమాటికిఁ గొండలయందు మండలిత శిఖండంబులగు శిఖండులు తాండవింపఁ దొడంగె. రతిపతి యెదుటఁ బటు తటిద్గుణ కోణాహతంబులైన దివ్యపటహంబుల వలె మ్రోయు జల ధరంబులు పాంథులచే మహాసాహసంబున నాలకింపఁబడె. గొంతకాలము వనాంతరమ్ములు, దలిత కందలమ్ములు నుచ్ఛ్వసద్దర్దురమ్ములు, వికస త్కుటజంబమ్ములు, స్ఫుట కైతకమ్ములు, ముదిత చాతకమ్ములు, సంహృష్ట బర్హిణ మ్ములు నయ్యె నాడుచున్న నెమళుల పింఛములచే నలం కృతంబులై నీప వనంబులు వికసింప సుగంధి శిలీంధ్ర గంధంబుల నొప్పారు కృతక మహీధరంబు లమ్మహారాజు నెమ్మది నెన్నిమారులకైన నవనవత్వంబు నావహించె. 40

తే. గంధవాహ కరంబుల । ఘనచయంబు
మొగలి పూపొడి పేరటి । బూదెఁ జల్లి
యధిపు వనితల మాన మ । హాగ్రహంబుఁ
బాఱ వెనఁదోలె నతిమిహుం । బ్రద్రవములు. 41

క. వితతాగురు ధూపిత సుం
చిత దంతుర కుంతలా ర । చిత సౌమనస

ద్యుతియుతము సమ్యగమద మా
సుతను సమూహంబు నృపతి । సుఖితు నొనర్చెన్. 42

తే. కైతకాంచిత గిరిమల్లి । కా సుగంధ
బంధుర సమీరణంబులు । బ్రకటరత్న
సౌధతలములు బ్రచలాకి । సమద కూజి
తములు స్మరదీపకము లయ్యె । ధరణి పతికి. 43

క. ప్రతి దినము జేలు ఘన గ
ర్జితముల యువతీ స్వయం ప । రీరంభణ సం
గతి సుఖముల నొసఁగుచు నర
పతి మెచ్చఁగ నర్మసచివ । పదమున నిలిచెన్. 44

తే. అంతఁ దామర పూఁదోట । లరుస మంద
హంగగు మహేంద్ర చాపంబు । దొంగిలించి
నెమళుల మొగంబులకును బీ । గములు వైనఁ
బ్రకటముగ సాగి వచ్చె శా । రద సమయము. 45

తే. తెల్లు పూఁజూలు విదళించి । యుల్లసిల్లి
యురు జపాశోణ నయనము । లుఱిమి చూచి
దీప్ర ఖద్యోత వసనంబుఁ । దెఱచి దుమికె
ఘనఘటల మీఁద శారదా । గమ మృగపతి. 46

చ. హరి కినుఁ డిందుఁడుం గనుల । టన్నది నిక్కువమాతఁ డప్పుని
ద్దురఁ బెడబాయగానవియుఁ । దోరఁపుఁ దెల్వివహించెఁగానస
ద్గురు నుపదేశయుక్తి నను । కూలుర చిత్తముల ట్లగస్త్యుఁ డం
బరమునఁ దోప నీరముల । పంకములై వెలసెన్నితచ్ఛవిన్. 47

తే. స్వచ్ఛ శారద నీరద । శాలితంబు
వ్యపగత తటిత్కమై యొప్పె । నంబరంబు
పవడములఁ బాసి నఱుఁగు తి । ప్పలు పయిఁకొన
డంబెనయు సాగరంబు జ । లంబువోలె. 48

సీ. వర్షాం బుదములచే । పరిధూతమై విని
ర్మలమయ్యె నలుచంగ । మామమేను
కలహంస నిచయంబు । కలుషతఁ దొఱఁగి కా
ర్యమ్ముఁగొన్న యూపగా । సఖులఁగలిసె
వలిపుంగవాళి రు । చ్యమగు నాసవమాని
పుష్పవతులతోఁడఁ । బొందొనర్చె
గగనరంగస్థలం । బొగినొప్పె నృత్య దీ
పికలతో ఘన యవ । నికలు దొలఁగ

తే. దొరసి శరదంబుజాక్షి కు । తూహలముస
సోయగంబగు తన మోముఁ । జూచుకొనఁగ
నభ్ర చయ చోలమెడలించి । యనఘరించెఁ
దళుకు లీను నహార్పతి । దర్పణంబు 49

క. సరసులదరి విహరించెడు
హరిభావిని కాలియంది । యలమొఱపమనఁ
స్వరమంగళ తూర్యమునా
నరుదగు కలహంసకులక । లారవ మెసఁగెఁ. 50

తే. ఫుల్ల దుత్పల నయనల । స్ఫురిత చంద్ర
ముఖుల గుముదాచ్ఛ హాసితలఁ । బూర్ణచంద్ర

కాంశుక స్ఫుటతారక । హార ధరల
యామినులఁ బ్రియతమల జేఁ । డనుభవించె. 51

క. కలముగ నవ్విభు యశముం
గ లమావంతికలు గీతి । కలఁ బాడిరి పా
క లసితమహితేజుఁ భవో
త్కల మౌక్తిక రచిత హార । కల నాంచితలై. 52

ఆ. ఫుల్ల సప్తపర్ణ । పుష్ప సౌరభ భర
ప్రసర పక్ష్మలితము । వన్య వాయు
నార మకృత యంత్ర । వారణంబుల రాజ
వారణముల జేసెఁ । జేరి భృశము. 53

తే. గహన భూసతు లెల్లెడ । గాలిచేత
నవజపాదీప కలికల । నవధరించి
తేజమిడ రాజు నాన నీ । రాజనముల
నొసఁగిరి జయాశ్వములకు మ । హోత్సవమున. 54

సీ. హిమ భరంబులఁ దోఁగి । కమలాకర నికాయ
మతిమాత్ర మాహత । మగుచు నుండ
మృగలాంఛనుండు ని । ర్మలోదిత ప్రకాశుఁడై
కాంక్షింపరాని యా । కార మూన
మణిత ప్రణాద సం । భారా వితరముగ
క్షణదా చయం బను । క్షణము ప్రోయ
రాజదారల ముఖాం । భోజ వాటిక సిరి
యప్రతిశాసన । మై రహింప

తే. మదన కేళీకలాసక్త ౹ మానసుండు
వాసవోపముఁ డధిక వి ౹ లాసకలితుఁ
డైన నరపాలునకుఁ బ్రియ ౹ మాచరింప
వరుసతోవచ్చె హేమంత ౹ వాసరములు 55

వ. మనోభవ సనాభియగు నమ్మహీనాయకుండా హేమాగ
మంబున ఫుల్లములగు మొల్లపూవులఁ బొదివిన ముంగి
ల కొమరున నసమయంబునను ముక్తాకలాపాలంకృత
లుగాఁ దోఁచుచు బహుళకుంకుమ పంకవిలేపన ప్రసృ
మరోష్మపయోధరమండలలగు నిజప్రమదలతోనగురు
గంధిలములగు గర్భగృహంబుల నవిరతము విధిజ్ఞుఁడై
విహరించుచు శిశిరయామవతుల రాకకుఁ గుతూహల
మున నెదురు సూచుచుండెను. అయ్యవని పాలుని విలా
సినులు రోమాంచ కంచుకిత కుచమండలలు సీత్కార
ప్రచుర ముఖాబ్జలునై యవిశ్రాంతముగ స్మర తంత్ర
మనుభవించు చున్నట్లుండిరి. అంత నారాజకుమారుఁడా
సహాస్యాంతమున రతి విభ్రమ పిశునములగు చలదృశల
యలికాగురు బిందువులచే శబలితములైన నవలవంగ ప్రస
వాస్తృత తల్పభాగముల మెట్టి యనునిశంబును పూచిన
క్రొత్తలొద్దుగ పూపొడి పూతలచేత జగి మిగులు చెక్కుళు
లతో కస్తూరికా తిలకాంచిత ఫాలతలంబులతో నాలోక
నీయములగు మృగాక్షుల మొగమ్ములకు నెమ్మనమ్ము
నప్పగించె నప్పుడు పులకితములైన యవయవములతోఁ
జలిగాలిపై వాదువెట్టుచు నవ్విభుని సవిధము జేరిన ముగ్ధ

వధూజనము భోగరససంభృతమగు స్వేదముఁగప్పి పుచ్చ
నేరక యూరక లజ్జఁగొందె. కచగ్రహణపూర్వక పరిచుం
బనముల నధరవ్రణవేదన మఱింత సేయుచున్న యనా
ఘుని యుపతివితానంబు నవ్వు దాఁచుకొని రోషముఁ
దెచ్చుకొని యెఱ్ఱని కనులతో చుఱచుఱఁ జూచెను. 56

తే. కలితకంచుక లక్ష్యన । ఖవ్రణంబు
నుత్తమాశ్లేషహేతు వ । నోహరంబు
యౌవనోష్మ నఖంపచం । బైన కోమల
స్తనయుగంబున్న నరపతి । చలికి మందు. 57

తే. భూజనుల కెల్ల పూవుల । పొలపు మొసఁగి
కిసలయమ్ముల దోయిలిఁ । బొసఁగఁ దాల్చి
కమ్మని పికమ్ముల రవమ్ము । గ్రమ్మ దేర
మనుజపతిఁ గొల్వ వచ్చె నా । మనియుఁ బూని. 58

తే. అభినవార్తవ సంపద । నధిగమించి
పూలగుత్తులఁ బొలిండ్లు । పొలపమూని
భ్రమరకాముకులనుఁ జేర్చు । వలపు నేర్చి
లలితదశఁ దాల్చె నుపవన । లతిక లోలి. 59

క. పొలయల్కలఁ బెఱుసను పొల
తుల హృదయము లలవడుటకుఁ । దోడిఁ జల్లిరి త
న్మలయానిల మాంత్రికులు
జ్వాల మధుగంధిల రసాల । సౌమ రజంబుల్. 60

క. ఉద్యానంబుల వాలిచెల
సద్యుతులొ నన పలాశ । జాలకములు సం

ఛేద్య పధికాగ్ర మజ్జ
న్మోద్యత్స్మర కేసరీంద్ర । సఖ కుటిలములై. 61

చ. తెగకొని సోలు తుమ్మెదల । తేకువ కజ్జలపాత రమ్యమై
జగమున నింపుఁ బెంప నవ । చంపక మంజరు లెల్లెడ న్నిమా
పగమరమాపురంధ్రి చెలు । వంబున మార రమహోత్సవం
బునన్ । దగఁ బ్రకటించు దీపములు । దారి వహించె
నుదారభూతితోన్. 62

ఉ. చారు విలోచనా వదన । సంస్తవ సంభృత సౌరభంబు వి
స్తార మొసంగెనమ్మధువు । స్వత్వమున న్వకులమ్ములందొగిన్
మారుతునం దనఃక్షణపు । మైత్రికి నీడుగఁ దత్ప్రసూనంబులుఁ
జేరిచెఁదానినొప్పుఁగద । స్త్రీయులకుందమకల్మిఁగూర్చుటల్.

ఉ. హాయిగ ప్రోయుకుంతలుల । యందియులందిన యద్దుఁ
గమ్మితో । నాయెడఁ జెల్మి సేయుటనొ । యట్టిదయానన
పల్లవంబు భృం । గాయత గీతికా కలిత । మై తనరార
నశోక భూరుహా । చ్ఛాయము దాల్చెఁ దత్వములు ।
సఖ్యమునం బొరి సంక్రమింపవే. 64

చ. గరితలు కౌఁగిలించిన వి । కాసరసంబున నల్లసిల్లి భా
స్వరముకులంబులం గురు । పాటువహించినచొప్పుఁగన్న య
క్కురవక మంకురాస్తుని య । కుంఠిత వృత్తి మచేతనంబులం
బరువడిఁజెల్లునంచునొక । భావముసూచన సేసె నెల్లచోన్.

మ. కలికా కార్ముకుఁ డధ్వగప్రతతిఁదా । కందాడివోనూదు కా
హల నిస్వాన మనంగఁ బంచమరవా । భ్యంచత్పికీసూక్తము
జ్జ్వలమై లోకమునాక్రమించె మధురా । స్వాద్యంబు హృద్యంబు

జూ । తలతా నూతన పల్లవంబు లేన కౌ । దార్యంబుఁ
జేకూర్పఁగన్. 66

సీ. పలకపై రతిపతి । వ్రాయ నుద్యోగించి
మతినున్న యాకృతి । పతిని వ్రాసి
రాతఁడు పులకింపఁ । బాతఁబూయఁగఁ బోయి
యాస్విన్న పులకిత । హస్తలైరి
తగిన రాగంబున । దర్పకుఁ బాడఁబోఁ
దడబడి విభుచరి । త్రములఁ గొనిరి
భూమీశుపై గంధ । వారిఁ జల్ల నుంకించి
యది చెమ్మటఁ దలఁగు । టరయరైరి
తే. కంకణంబులు మ్రోయ మే । ఖలలు కలఁగ
హారములు చిక్కువడ లులి । తాలకలయి
తొడరి రతిభేద ముయ్యెల । తోడ గలచి
చెలులఁ గని చిన్నవోయిరి । చెలువ లప్పుడు. 67

శా. ఈరీతిన్సకలర్తు సంచయమునం । దిచ్ఛా విశేషంబులన్
శ్రీరమ్యుండయినిర్విశంకముగ ని । ర్వేశించియున్కంతతో
నారీవారమను క్షణంబుఁగొలువ । న్మన్నించె రాజన్యముం
డాకుండుత్సుకుఁడై । తృతీయపురుషార్థంబుం గృతార్థంబుగన్

తే. దేవయువతుల కెనయైన । దేవులాఱయ
నందనము వోని ప్రమద వ । నంబునందు
సలలితంబుగఁ గుసుమాప । చయమొనర్పఁ
జనియె నొకపరిఁ బతి దివ । స్పతియువోలె. 69

చ. ప్రచలితుఁడౌ నృపాలు ముఖ । రన్మణిమేఖలమౌ విలాసినీ
నిచయము, గంధవాహునలి । నిర్భరచందన శైలవల్లరీ
ప్రచయముఁబోలె వెన్కొనియె । వానిసశంకుఁడొనర్చెనూపురో
పచితరవంబు వెంటఁబడు । భావజుచాపముప్రోతకుద్దియై

తే. పరివహద్రాగ పూర క । ల్పములు కోమల
యంఘ్రు లోలయుటనంటిన । యావకముల
నరుణతరమై వెలింగె నా । సరణియెల్లఁ
జిగురు టాకులచేత నా । స్తృతయుఁబోలె 71

ఆ. వివిధ విలసితములు । వెలదుల యసితసి
తారుణ ప్రభంబు । లగు కటాక్ష
ములు సెలంగ దివము । వొలిచెను గువలయ
కైరవారవింద । ఖచితమట్లు. 72

క. ఆరాజుతోడ నడిచెడు
సారంగాక్షుల మిథః ప్ర । సక్తములగు వా
గ్ధోరణుల మధురిమలు బహు
ధారసభంగీతరంగి । తమ్ములై వొలిచెఁ. 73

వ. మృద్వంగీ? ముందు వోవుచున్న హరిణ దృశల తెరువు వదలి మఱియొక దారిని మెల్లగా నడువుము. గమన వేగమున రాలిన హారముల ముత్తెముల వలన శర్కరిలమైనదీ త్రోవ దీన నీవడు గిడకుము. నలినముఖీ? యిచ్చోటనిదుర వోవుచున్న రాజహంసాంగనల నందియల మొఱపంబున నేల మేలుకొలిపెదవు? నీపాదపద్మలగ్నములై యవి తప్పక తొందరకు బంధములయ్యెను. అలికేశీ ? యిక్కరంగము

కరనఖర మరీచి మంజరులచే నాహతహృదయమై జలశం
కచేఁ బఱవెత్తుచున్నది. నీవొక పరివిలోకింపుము. చెలి!
విలక్ష్యమై యది నియతముగ నివర్తించుచున్నది. శశి
ముఖి! శశికాంత కుట్టిమంబులస్ఖలనభీతి నడుగుతీసి
యడుగిడకుంటివి. ఇది నీదు వదనానుబింబ రాజియే కాని
నవపంక జోపహారముకాదు. ముగ్ధరాలా! ఏమని మెత్త
మెత్తగా నడచుచున్నావు. కితవుఁడు కామినులతోఁ గూడ
నేగుచుండుట యెఱుఁగవా? క్రొత్తపూదుమారములఁజీకట్లు
గ్రమ్మ నిమ్మహావనమ్ము పవలనక యభిసరింపఁ దగియే
యున్నది. సారంగ లోచనా! ఇంత ద్రుతగతి యేటికే?
తెలిసినదిలే! ముందువోయి వెనుకకుఁ దిరిగి విభుని వదన
కమల మవలోకించి సుఖింప నెంచితివి పొమ్ము. దయి
తతముని యపరాంగ మంతకుఁ జాలదటే? హరిణ నయ
నల మనములుజనసములు కదా? మత్తరాలా! నీ స్తన
జఘన ఘనతనే నెఱుంగని దానఁ గాను. నీవు మాత్రము
వడిగా నడువక తప్పదు. బహువల్లభు లగుభూవల్లభుల
యువతిజనం బెడసేయక సేవించుకొనవలయును. నీవింత
విచారింపవు. కలకంఠీ? ఇమ్మావి ప్రమాకునకు రాగాంకు
రము లతిశయించి నప్పుడా నీ బాంధవము. ఎల్లప్పుడు
సంగీత మపేక్షింపదు కాబోలు. సాహిత్యమే దీనియభి
లషితము. రసార్ద్రా! నీవేమి రోహిణివటే? రాజు
మన్నన వడయ నోషధీశుల నమ్మరాదని యెఱుఁగవు
కాబోలు! ఇట్టివారి సంగతి మంచివారలకుఁ గూడఁ

గూడనివాడు వచ్చును. చెలీ! నీవు నిక్కిలి మెల్లగా నడుగులు లెక్కవెట్టుకొనుచు నడువుము. ముందుపోయెడు వారు పోవ, విభుం డొకప్పుడు వెనుకకుం దిరిగిన నీయదృష్టమే మెచ్చవచ్చును. సఖీ? చాల దూరము నడిచితివి కదే? యింకెంతదవ్వాయుద్యానము. నెమ్మొగమెల్ల చెమ్మగిల్లుచున్నది. అలంకారప్రియా! యని నిన్నిప్పు డొకసారి చూచిన నాకు పసదనము. అనుచు ననేకవిధ కథనములతో.

౯. చనిచని జనపతివనితలు
కనదలి సంకలిత గీతి । కాపంచమని
స్వన వినుత పికీకూజన
ఘనకౌసుమవనముఁ జొచ్చి । కనుఁగొనుచుండె. 75

ర గ డ

చూచితె యశోకమును । సుందరి! యశోకమును
దాచితిని తొలిపూవు । దర్పకునిఁ బూజింపు
మవయవవిహీనుఁ జెలి । యర్చింపఁ దగవటే
నవమన్మథునకిమ్ము । నాతిరో యల్లైన
చూతమే చూతంబు । సూనాస్త్రసంపాది
నాతిమన మెవ్వార మ । నగ మర్మమెఱుఁగవిం
చిదిమెదను కురవకముఁ । జెల్వయళి రేపకుము
వదన సౌరభమెంచి । వదలదది వెంటఁబడు
నెలమావిఁ జేరకుము । యింతిగో కోకిలము
చెలయు నీకెమ్మోవిఁ । జిగురుపై రుచిమాని

తిలకంబుఁ దిలకింప । తెఱవనాకన్నాను
కలికి కన్నులనిండెఁ । గౌసుమపరాగంబు
రాగంబుఁ బొందెనదె । బోగముదినాఁడు మెల
నాగ! పూవులుపూచె । నడిమింటఁ గ్రొనుము
కమ్మతెమ్మెర లిందుఁ । గాంత! పైకొనఁజొచ్చె
నమ్మఁదీరదు నచ్చినం । దిరుగుఁ బోతులను
మోదమున విప్పారె । ముదితరో! పలాశంబు
వేదుఱకె దయ్యెంబు । విరహీ పలలాశంబు
నకులము ల్నింపితివె । పడతి! నీయొడి నింప
నొకజాతి కుసుమంబ । యొయ్యారి! నాకించు
నించువిల్తుని పూజ । కేవిరు ల్గోసితివి
యించువిల్తుని పూజ । కే విరు ల్గోసితిని
పున్నాగముల సేవ । పూఁబోండ్ల కేనాఁడుఁ
బున్నాగముల సేవ । పూఁబోండ్ల కేనాఁడుఁ
నాఁడువారల కింత । యగునె స్వాతంత్ర్యంబు
లాడువారల కింత । యగునె స్వాతంత్ర్యంబు
లిటు కంటకం బంటె । నిగురుఁ బోడిరో! చూడు
కటు కంటకిత మయ్యెఁ । గాయమహారా! చూడు
మీనాక్షి నెమ్మేను । మెఱసెఁ జెమ్మటఁ గ్రమ్మ
కౌను నల్లలనాడెఁ । గందె నీచెక్కుళ్ళు
నిందాక బాలుఁడే । యినుఁ డెంతవాఁ డయ్యె
సుందరుల గాఱించె । సుదతి ఖర కరములను
జాలఁగా శ్రమమయ్యె । జానలారా! చాలుఁ

బూలకై దూరకుఁడు । బూవుఁటీరమ్ముల
పని నవలఁ గోసికొని । యసుంబుజాతాంబకలు
జననాథుతోఁ గూడ । జలమాడు వేడుకలఁ
గ్రొమ్ముడపు లీవ్వెడంగఁ । గ్రొంజెమట లెగయంగఁ
గమ్మనౌ పలుకులకుఁ । గలహంస లెదురు కొన
కమలాకరముఁ బోని । కమలాకరముఁ జేరి
కోమరారు తమపులను । గోర్కిమైఁ దార్చి రొగి. 76

క. ఈరీతి విభుని తోడఁ జ
కోర విలోచనలు దగిరి । కొలనున నదియుఁన్
స్మార వరుణాస్త్ర మన న
వ్వారి తపన తాపవహ్ని । బాణము నాగెఁ. 77

తే. బాహు యుగమున నడుమ క । ల్పన మొనర్చి
చలిత జఘనోరు బింబతా । చాసల కొగి
నీతలాడుట నేర్పెడు । కైతవమునఁ
జలిపెఁ బురుషాయి తోపదే । శంబు నృపతి. 78

మ. అవనీశుం డభిలాషి యై సలిల మొం । డబ్జాక్షి పైఁ జల్ల నో
క్కవధూటీముఖచూర్ణపిపక్ష మమునుణా । కుంభేలకో యమ్యో
నా । ధవుఁలీలాసలిలాపవారితకరో । త్సంగాగ్రసంస్పృష్ట యై
సవతుల్కన్గొనఁగౌఁగలించెనదిమ । త్స్యగ్రాసదంభంబునన్.

సీ. పాద పద్మంబుల । పైఁ బడి పోరలాడి
రయుత్సంగ తలముల । యుదుటు దాటి
నీవి బంధము తోడి । నెలవుల కెగఁ బ్రాకి
నాభి చక్రంబు రం । ధ్రంబుఁ దాకి

యుత్తుంగ కుచతటుల । లొఱసి యుద్ధతిఁ బొంగి
కంధర వీచిదో । ర్బంధ మొసఁగి
ఘననీల కైశికం । బనువు మైకొనఁ దాల్చి
ముఖ చంద్రబింబంబు । ముద్దు వెట్ట

తే. యాలతాంగులఁ గొని చెందె । నంబు పూర
మంతరములేని రాగర । సానుభవము
జడధు లచ్ఛలు ననరాదు । స్మరుని బారి
కగ్గమైనప్పు పౌరవ । శ్యమ్ము మెండు. 80

తే. సలిల హతిభీతిఁ దిరిగిన । చాన వెన్ను
వెంట నంటి చలించిన । వేణిఁ జూచి
భావజన్మని పలకయు । వాలుననుచుఁ
దలఁచె నెమ్మది నద్ధరా । ధార భుజుఁడు. 81

మ. ఒకకాంతామణిమై నఖక్షతముల । త్యుత్కటత్వ్రణ
త్తెప్పర్వా । ల్పక యత్తే కనుఁగొంటకున్మనను నా । వ్వన్వె
అయోనిర్ఘృణా । ల్పక భూనాథలలాముపై సలిలము ।
లోరంబుగాఁ జల్లి యం । బక యుగ్మంబు మొగుడ్పఁ జేసెఁ
గసివా । వం బూటనయ్యాటతోఁ. 82

తే. రతివిధంబున జలకేళి । రాగవతుల
యధర మమలము నయనమ । నంజనాభ
మపగతలలామములలాట । మాచరించి
మేదినీపతి మదికెక్క । మెచ్చఁగొనియె. 83

క. గంధము పూఁతలువో సర
విందపరాగంబు గవిసి । వెలదుల కుచ సీ

మందలముగానిన నఖపద
సందోహము కానరాని । సోరు వహించెన్. 84

క. పడతుల యవతంసంబులు
కసుగడి వాలం బ్రవాహ । కము వెలివెట్టెన్
జడమైన జంతువేనియు
నోడఁగూడునె శ్రోతులఁ దోడగు । సద్వృత్తముల్ తగన్. 85

తే. సకల లలితలలామ చ । క్రికలు రాజ
శేఖరుని మహీలామ చ । క్రికలువాఁడు
వారి పూరంబు విడనేర । వైరి విహృతి
రస వశంబునఁ బ్రియుని వా । రణ మొనసియు. 86

క. అంతట విహారఖేద
శ్రాంతలు కాంతలునుఁ దాను । సరసి వెడలె భూ
కాంతుండచ్చర లేమలు
శాంత మెఱయ సబ్ధిదోఁచ । బుధతరు వసఁగన్. 87

తే. తడిసి యుదికిన చీరపైఁ । దళుకుకుచ
సంకముల సౌరు సఖదశ । నాంక సూచియు
సలిలదంతుర దీర్ఘ కుం । తల కలాప
మంగనల కైవసము సేసె । నధిపు మనసు. 88

తే. చికురనియమనములయందుఁ । జిగురుఁబోండ్లు
ఘాతపరిధానములఁ దాల్చు । తఱులయందుఁ
దత్తదభిమతపద ము । యత్నముగఁ జూచి
కాము నేలితి ననుకొనెఁ । గంపరాజు. 89

శా. సైరంధ్రీకృతసంవిధానము పరి । ష్కారంబుతో నొప్పియు
ద్గారాణోన్మలి ఘారంధ్రములుం గొలువ శు । ద్ధాంతంబునం జేరి వి
శ్వాగాధ్యంబు త్రయీస్తుతంబు త్రిపుర । వ్యాపాదనం బౌమహం
బారాధించి యథార్హ్యతం గడిపె ధ । న్యంబౌ సహశ్రీషము౯.

## ఆశ్వాసాంతము

శా. విద్యాస్థాస వినిర్ణయాది రచనా । విఖ్యాతభావోదయా
మాద్యద్వైరివివాదఖాదనకలో । న్మత్తాశయ ప్రోచ్ఛ్రియా
హృద్యాత్మీయ విధేయబోధకలనా । హీనోపలబ్ధిప్రియా
సద్యస్సత్ఫల దానమానితమునీ । షాప్రాపితాయత్యయా.

క. కాదంబరీరసాతిగ
కాదంబర్యాంధ్రకరణ । కలనాంచిత స
ద్వైదుష్య ప్రకటిత కవి
తాదయితత్వానుయోగి । తగుణ విలసనా. 92

## మాలిని

దలితకలుషజాలా! । ధ్యానయోగానుపాలా!
విలులితవిషయాదీ! । వేత్తృ వేద్యత్వవేదీ!
ఫలితనియమచారీ! । భస్మరుద్రాక్షధారీ!
సలలితగుణపూర్తీ! । సాహితీచక్రవర్తీ! 93

గద్య.

ఇతి శ్రీమదుమామహేశ్వర చరణనళిన నిత్య సేవా
సమాసాదితానవద్య కవితాయోగ హృద్య సహితా
త్రేయ గోత్ర పవిత్ర హనుమత్సుధీ తనయ విదితనయ
లక్ష్మ్యంబా గర్భ శుక్తి ముక్తాఫలాయమాన వేం
కట కవీంద్రాత్మజత్వాయమాన హనుమమాంబా
శమీ గర్భ హవిర్భుజాయమాన శ్రీ దేవీ
సేవ్యమాన రాఘవ నారాయణాభిధాన
ప్రణీతంబైన
మధురావిజయమను శ్రీవీరకంపరాయ చరిత్రమునందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.



ఓం

శ్రీపరమేశ్వరాయనమః

# శ్రీ మధురావిజయము

## తృతీయాశ్వాసము



వాణీ సాహిత్య
ప్రావీణ్య యశో౽నవద్య । రామాపత్యో
ద్భావాయిత పరమేశ్వర
సేవాఫల నాగలింగ । సిద్ధమనీషా ! 1

వ. అవధరింపు మారాజన్యమాన్యాంగన వర్ణించిన చారిత్రాంశంబు పరిపాటి వాటముగా. 2

తే. అంతఁ గంపనరేంద్రు నీ । మంతవతుల
మోముఁ దమ్ములసిరి పంక । భూచయమ్ము
చేత దోఁయించి యపరాధ । భీతినాఁకొ
చరమగిరికందరముఁ జేర । నరిగె నినుఁడు. 3

ఆ. అంబుజములు తనమ । హంబెల్ల జుట్టెన
నార్ద్రవలన మఱల । నది గడింప
ననఁగ వేగవల్గితాశ్వంబు । హరిదశ్వుఁ
డపర సలిలరాశి । యందుఁ జొచ్చె. 5

క. వరుణాంతఃపుర కాంతలు
హరి మండలముం గలంచి । రస్వర్ణ స
త్వరతం బుల్లినదినరమ
హిరణ్యమణికుండల మని । హ్లాదయములంపుఁగ. 5

తే. తరణి కరముల తాకుచు । నరుణములగు
నరుణు తరుణుల సుకపోల । ఫలకతతులు
మదపుఁగ బెట్టుఁదనమూనె । మునుపె పసముఁ
జవిఁగొనక మున్న ధార్ష్ట్య మ । ర్ఘూర్ణి మనునె. 6

క. హరి యంతవాఁడు గమలో
దరమదిరంగరపుటములఁ । ద్రావి విడిచె నఁ
బరముఁ బ్రచేతసునాశా
కరిగమనందవి లె మద వి । కారంబన దే ? 7

ను. ప్రథమాశావిరహంబునం గములిసి । బంధు ప్రసంతాపమ
త్యధికంబాత్మ వహించి యంత నపరా । వ్యాసంగముం
బొందెఁ యూ । విధమెల్లనమ్మజాచె న్నరాగులమనో । వృత్తి
న్విమర్శించి యూ । విధియుం గన్గొని నేరఁ డుత్తములు
యు । ద్వృత్తుల్కరంబ బ్రముల్. 8

క. పరదేశమునో నెంచిన
హరి పునరావృత్తిఁ గోరి । యబ్జిని మొగిచెం

గరములనఁ గరమువొలి చెం
దరముకుల ద్దలములైన । తామరపూవుల్. 9

ఉ. పంబినగాడ్పుచే నెగయఁ । బాలుతరంగములందుఁ దోచునా
బింబపరంపరంగనిన । విజ్ఞులెదందల పోసిరట్టిచో
నంబర వీధినుండి డిగ । నంబుజమిత్రున కంబునాథుఁడా
యంబుధిఁ గట్టినట్టి మణి । యంత్రితమైతగు మెట్టుకట్టుగన్.

సీ. పడమటి మున్నీటి । వాకలోఁ దోచిన
ప్రతిబింబమున డాయు । భానుబింబ
మహారసపసాన నా । ట్యము సేయు ధూర్జటి
పైడి తాలంపు వి । భ్రమముఁ దాల్చె
నంశుమంతుఁడు వోవ । నాకసంబుననున్న
కొన్ని యాతని కరాం । కురము లప్పుడు
తటి పేరికరి రాజు । విడిచినఁ జెడిన య
హర్వృక్షపుం గొమ్మ । లనఁగ నయ్యె

తే. రేయిఁ దిలకించి యెడపదు । రీతి నెంచి
తమ్మిపూలఁ దలంచి దై । న్యమ్ముఁ బెంచి
నోటి బిసములు రాల నెం । దును జలించి
కాంచె దినమాథుత్రోవ జ । క్క వలకవలు. 11

తే. విష్ణుపద మతిలంఘించి । విపతితుఁడగు
ఖగతి నొందుపలక్షించి । ఖగములెల్లఁ
జలనములుమాని మిగుల భీ । తిలిన యట్లు
లొయ్యనొయ్యన గూళ్ళలో । నొదుగఁ బాఱె. 12

క. మునుఁగంబడు నినమండల
మున దోనికెడు ఘృణివితాన । మున రంజతమై
వనధి మధుకైటభాసృ
గ్జనితారుణ్యమగు నాఁటి । కల మఱలఁ గొనెన్. 13

మ. పరితాపంబువియోగినీమనములన్ । భానంబుజ్యోతిర్గతాం
తరభూమిం దగడాచి పోవు రవిపై । న్యంబుద్ధతిందక్కి పో
వ రయంబాఱఁగఁ జీకటుల్గవిసెనా । భాసిల్లె మందాతపా
వరణంబే దఁగఁ జెట్లనీడ లెగువం । బాఱంబ్రదోషంబునన్

తే. భావిభావితమైన గ । భస్తిమాలి
బింబ మంబుధిలోఁ జల । నంబు నొంద
మాటిమాటికి నాల్కల । మాంసఖండ
మనుచుఁ దాటించె శఫరంబు । లాసమిగుల. 15

చ. తనయరవిందమందిరము । తల్పులతేకులుమూసి పైన వ్రా
లిన యళికైతవంబునఁ జ । లింపనిజాతుషముద్రవైచి డా
చిన మధుసౌరభంబు లొరు । చేతికిఁజిక్కకయుండ నెల్లెడం
దినరమ కాపువెట్టి చనఁ । దిగ్గెడు యామికులట్లు తుమ్మెదల్

మ. హారిరథ్యమ్ములగిట్టలన్నెగయున । స్తాద్ర్యగ్ర్యధాత్వోఘమో
వరుణా శారుణ కందుకం బా! యన భా । స్వద్రూప
యాసంధ్యా వా । సరవేషంబును వీడి కాలనటుఁడా ।
స్థ న్యామినీభూమికం । దరిఁ దాల్పం దెఱవైచె నానాక
ముహూ । ర్తం బాక్రమించెన్దివిన్. 17

ఉ. ఆయెడ వచ్చుచున్న నిశ । యంఘ్రులలత్తుకపోలు సంజ
కెం । జాయఁ గరంబితంబు ఘన । జాలము తేజము మింటఁ

దోఁచెన । చ్ఛాయ మగంటు సంద్రమున । సత్వరుఁడై
దుముకన్నముత్థితం । బై యలరారు విద్రుమచ । యంబనఁ
బల్లవ కోమలచ్ఛవిఁ. 18

సీ. ఆశావధూమణు । లవతంసముగఁ జేయు
లలితతమాల ప । ల్లవచయంబొ
రజనిమోమునఁ బత్ర । రచనం బొనర్చిన
నిగనిగ లాడెడు । మృగమదంబొ
దినమణి మణులందుఁ । దేజంబు చల్లార
నెగసి రోదసినిండు । పొగలప్రోవొ
మగలెల్ల మొగుడుఁ దా । మరలఁ జిక్కిన జాలి
రేఁగి మూఁగిన భ్రమ । రీనికరమొ

తే. హాలిహాలంబున దలనంబు । నంది మెఱయు
కలిత యామునకందల । కాలిమంబొ
యనఁగ నంబర తలమెల్ల । నాముకొనియెఁ
దరతరమ మీఱి యతిసాంద్ర । తమముతమము. 19

తే. ప్రొద్దుదివ్వెకుఁ బొడమిన । పొగలవలన
నాకసంబున దట్టమై । యదిరిరాలు
మసియనఁగ నల్లనైనత । మంబుజనుల
కనులు మూయించె నిద్దియుఁ । గాంచసీక. 20

తే. బిందుజాలకమునుఁ బోని । పిన్నని యుడు
గణముతో దట్టమైన చీ । కటిఁ దలంచెఁ
బ్రజ దినాత్యయమునఁ దాండ । వంబు సలుపు
శివునిచే జాఱిపడు గజా । జిన మటంచు. 21

క. అతిపరుషాతపమునఁ దా
పితమగు గగనమునఁ జెమట । బిందువులన సూ
చిత తరలద్యుతులగుచుం
గతి పయములు పిదపఁ దార । కంబులుతోఁచెన్. 22

చ. సమయకృషీవలుండు నవ । చంద్రిక పేరటిపైరుఁగోరి సం
తమస జలంబునం గలుపి । తం బొనరించిన మింటినేలపై
విమలములైన చుక్కలను । విత్తసముల్వెదవెట్టఁదన్మయూ
ఖములనుమాఱుపేర । మొలకల్మొలతేరెడుఁదారుమాఱుగన్

తే. తిమిరమునఁ గందలిత మభ్ర । దివ్యతరువు
సంజకెంజాయ చివురుగా । శాఖలెల్ల
యాశలునుఁగా నిరంతర । మగుచుఁ బూచె
నడుసుమంబుల వెన్నెల । పొఁనులు నెఱయ. 24

క. అనురాగాంజనమును లో
చనములకిడి వెడలెడు నభి । సారికల జనుల్
గనుఁగొనిరి మొనయు జీకటి
కను మఱువునఁగూఢ శ్వసిత । గంధముచేతన్. 25

తే. పవలు విలయంబునొంద న । ర్భకులువోని
శరణ దీపము లారాత్రి । జనని నెనసి
యాత్మదశ కర్హమైన స్నే । హంబుఁ గొనుచు
వృద్ధిఁజెందెను లోకంబు । వేడ్కఁ బెనుప. 26

క. ఇనులగమి యనెడు తుఱుమునఁ
బొరిరిక్కల విరులఁ దుఱిమి । పూచెడు నిండీ

వరము మొగమలర మిక్కిలి
నిరీక్షణము సేయఁజొచ్చె । నిశ శశిరాక్ష. 27

తే. అంతక్షణదాగ మొల్లస । దంబురాశి
వీచికాగ్రోచులం బోని । విధుకరముల
యంకురంబులు విలసిల్లె । సట్లు కొన్ని
శాతమఖమా దిశాముఖ । స్థలమునందు. 28

సీ. ముగ్ధాల సత్వంబు । ముద్దులు మూలగా
రాణించు తరలతా । రకలతోడ
నిట్టూర్పుగాడ్పుల । నెలవునాఁడగిశర
కాండపాండురమౌ మొ । గంబుతోడ
నవ్యోక్తి మధురిమ । నవ ధరించినమేలి
పులుగుల పల్కుల । పొలుపుతోడ
నంతిక విగలత్త । మోంబరమై పంబి
మెఱుఁగారు కలికి వె । మ్మనితోడ

తే. వాసవాశావధూటి గ । ర్భంబుమోచి
మోచి తఱియైనఁగనె మగ । మొలకనొండు
నతఁడుదయరాగ లోహిత । మైన యొడలి
తోడఁ దోతెంచెఁ దొవలకు । దొరనటంచు. 29

ఉ. యావక పిండరక్తమగు । నాహిమదీధితి మండలంబు దే
వావలి నేలువాని దెస । యాననమండలి చెందిరంపుఁ బొ
ట్టా వెడవింటివానికయి । యప్పుడపూచినహల్లకంబులం
బ్రోవిడిపోతఁబోసినవి । రోహితమౌగడుగాయనందగెఁ.

తే. పరుషుఁడేమైన నట్లు ప్ర । భానిధాన
మగునినుఁడు వోవవిధురమై । నట్టి జగము
నల్లమెత్తని కరముల । నాదరించి
యూరడించె నవాభ్యుద । యుండు రాజు. 31

సీ. కార్యజ్ఞుఁడైన య । క్కంపనృపాలుండు
సమమోదితాచార । సమితిఁ దీర్చి
గంగాభిధాన యో । కఖ్యాత సవిధంబు
నందున్న ప్రియతమ । నాదరించి
కమలాయతాక్షి యి । క్కాలంబు సరసమౌ
వర్షసర్గ సేయఁ । బడెడుఁ గాత
త్వద్వచనం బమ్మ । తంబు నీతఁడు చెవిఁ
ద్రావించు కుతుకంబుఁ । దాల్చినాఁడు

ఆ. అమ్మటంచుఁ బలుక । సారిది ముఖాంబుజం
బించుకంత వంచి । యినునిఁ గాంచి
రసవదనఘపద స । రస్వతియన నా స
రస్వతిం గ్రహించె । రాజవదన. 32

తే. ఇంచు కమ్మనిగాలితో । నెనక మెసఁగు
వలిపె వెన్నెల లెల్లెడఁ । బొటు రాజ
చంద్ర! వెడవింటివానిఁ బో । షణము సేయు
కాలము గనుంగొ నంబడుఁ । గాత మిదియు. 33

తే. చాలకాలంబునకువచ్చి । చలువలదొర
గట్టిగాఁదూర్పు దెసపొల్తిఁ । గౌగిలించి

కరనఖంబులఁ దన వియో । గమున నైన
తిమిరవేణిక నొగిఁజిక్కు । దీయఁ జొచ్చె. 34

క. మిక్కిలి తొలిచుల నెత్తికి
నెక్కి నభఃపాత్రమంచు । నెసఁగుం దిమిరముఁ
దిక్కులదొరపీల్చె నిదె
గ్రక్కున ఘృణిగణ మృణాలి । కాముఖములతోన్. 35

క. నీమమునఁ గాచి కాచి త
మోమయము నీను ముదయరాగ । పుంజ్వలనమునన్
భూమీశ! మోషధీశుఁడు
కౌముది యనఁ జేసె మేలి । కలధౌతంబున్. 36

క. శశియను శంఖపుఁ బెట్టె
న్నిశ గైకొని యెసగఁ బొసఁగు । నెఱఁ గుముద విభా
విశదము వెన్నెల పుట్టము
దిశయను నవలా ధరించి । దీప్తి వహించెన్. 37

తే. వాసవాశా సుకృశఁ జేరి । వలఁపుఁ బెనిచి
కరములను జాచి కుముదిని । కనలు వాపి
చిత్తజుని మామ యూరిని । చిత్తముఁ గొనె
నమ్మ రాదెందుఁ గమితల । నమ్మ చెల్ల. 38

చ. కరముల మాటిమాటికి కేలు । గానిఁ బగా నొగిఁ జొప్పుచు
న్నృథా। కనుఁ డతి రాగియై నలిని । కై వెడచేతలుచేసెఁ
గాని య। ప్పరమ పతివ్రతామణియు । వానికి లోఁబడ
దయ్యె నద్దిరా! । తనరఁగు సత్వ మిట్టిదియ । తప్పొనరించిన
మంచి సేసినన్. 39

తే. తా నమాసయమాసకుఁ । దపనుఁ గలిసి
కొంత వేండ్రంబడిగి తెచ్చు । కొనునోయేమొ
కాకయున్న వియోగులఁ । గాల్చునెట్లు
తొవలనెలయించు కరములఁ । దుహినకరుఁడు. 40

మ. పురుహూతోపల ఖండమేచకరుచిం । బూర్ణేందునం
దొప్పుక । ప్పురయం గౌగిటఁ జేరియుండిన త్రియామా । మాకా
రమాఁగానియే । హరిణాంకంబునఁ గాదటందురొరుల ।
స్థానేమొ! పూర్వాద్రిభూ । తరధాఁగంబగు నాఁడు
పూయఁ దిరమా । తారంచునేనెంచెదన్. 41

వ. మఱియు నెఱజాణయగు నీనీరజారి యందు బహువల్లభుఁ
డగుటఁ దక్కినవారికన్నఁ దనపై నెక్కుడు మక్కువతో
మెలఁగవలయునని రోహిణియో? గురుదారయని నిర
సింపక తనకుఁ గైవసము కావలయునని తారయో?
వెట్టిన వేరులు వారుచున్న మందో? మాకో? తమతమ
భాగము లెచ్చుతగ్గులు లేకుండఁ గైకొంటకై యమృ
తాంధసు లుంచిన మిల్లిగరిటయో? చిత్తమునకెక్కిన
వైరియగు జీకటియో? యబ్జనామమ్మునఁ గొని చేరిన
యళిపుంజమ్మో? కలానిధాన మగుట లక్కబిగింపో?
అమృతమయుం డగుట నిండారఁ బొరలెడు పిపీలికానివ
హంబో? బింబపదంబు విని వ్రాలిన చిలుకయో? శూద్ర
ధరుండు గాన తద్వర్ణకమో? రాజుకాన హృదయ
స్వభావమో? తేజంబుకాన ధూమంబో? గగనాంగణ
మున వెట్టిన దీపంబుకాన కొడియో? అత్రిముని కంటి

ఘుసికాన. నలకయో? కలంకమను పేరఁ బొదుకొనిరొ.
ఇంక నిట్టిత్రోవల నేకములు కలవు కాని యింతకన్న, శివశిరో
మణియగు నీసత్పతి హృదయ మండలము పరిశుద్ధమగుట
ధ్యాన యోగంబున నిలిచి పోయిన, మహాకాళి యనిన
సమంజసముగ నుండునని తలంచెద. పక్షాంతరంబున,
విరహాపాత్రు నక్షి జ్వలనంబునకోడి యమృతమూర్తి
యగు మామ మాటున డాగి గుట్టైన లోకమెల్లఁ
జీకాకు సేయు శృంగార యోనిచ్ఛాయ కానోపు.
కాకున్న వెన్నెలయను పేరఁబూదుమూరము లీతమో?
మేనినుండి రాలఁ గతంబేమి? మఝ్ఝూరే? యీమామఁ
డెంత మాయలమారి. ఇప్పు డెటులఁ గరాకుండ విరోధి
యగు నంబాదయితు మూర్ధంబునఁ గదా యమరినాఁడు.
ముందఱ మేనమామ సుధానిధి, వెనుకఁ దోబుట్టువు గగన
స్రవంతి, హృదయంబునఁ బ్రియయగు రతి. ఎక్కడఁ జూచిన
విశ్వరూపుఁడగు మాధవుఁడు దేవవిభుఁడు తన వాఁడే కదా!
ప్రసూనములకు శిలీముఖములకుఁ గొఱంత యెక్కడిది
మందుఁడైన మారుతుఁ డీతనిపని సాధింప నేరనివాఁడు
కాడు. ఇవి యిట్లుండ దయారసమున నాప్యాయనముఁ
గూర్చు చూపులతోఁ దన యుపాస్య దేవతయగు జగ
దంబ సన్నిహిత యయ్యె నగ్రుడేమి సేయు? లోకమేమి
సేయు? యోగవంతులెల్ల నతని మెచ్చు బలగము. ఈతని
మతము విశిష్టాద్వైతము. దానన యోగివియోగి శబ్దము
లకు విషయ మించుక భిన్నమైన నర్థమొక్కటియ. వీని

మంచిసేసికొన యుక్తియైన ముక్తికాంతను సేవించుకొను
చుంటినని వాక్రుచ్చియే తీరవలయు నితని యనుగ్రహం
బున దుఃఖాపాయహాసమగు మోక్షమొదవు నీతఁడిక్కా
లంబుఁ బరిపాలించు నిక్కాలంబు వీనికిఁ గూర్చు. రాజ
శేఖరా! భూవల్లభా! మదనమోహనా! విధువదనా!
వశీకృతాశా! యివి యన్నియు నీ విలాసావతారంబుల.
ఇక్కాలామలెల్ల నీవయనియద్వైత భావంబున నిన్ను
సేవించుకొని, నీయనుగ్రహంబున నాప్తాఖిల కామగానున్న
దానవని పలుకుచున్న ముగ్ధరాలి ప్రతిభాలతిక యల్గికకు
ముద్దుఁగొని వర్ణింపరాని పారితోషికము లొసఁగి భోజనా
ద్యుపచారానంతర మారాజమణి చిలువపాన్పుచెలువ మె
నయు సుమతల్పంబున సుఖనిద్ర నొందె, నంతఁ గొంతసేపు
నకుఁ గరుపాఱుమోమున వ్రేలు ముంగురులతోఁ జెరిగిపో
యిన చేర్చుక్కతో నద్భుతముగుగన్దోయితో వేడినిట్టూ
ర్పుతో విన్ననగు నాననముతోఁ దూలు మైదీవతో
వ్రేలువేనలితో మాసినచీరతోఁ బాసిన యలంకారముతోఁ
జూడరాని యవస్థ నొందియు నొక్క తేజంబున, మహాను
భావత్వంబుఁ బ్రకటించు నొక్క యన్నులమిన్న యన్నే
లఱేని కన్నుల యెదుటఁ బొడసూపుటయు, నద్దినదయా
ళుఁడు తొలుత సభయమని తగు సత్కారము లాచరించి,
కుటుంబినీ తిలకంబ! నీవెవ్వతవు? నీకి కడగండ్లేలవచ్చె?
నీకడగండ్ల నీరుగాఱఁ గారణంబేమి? నీమేని కీవికృత వేష
మనుచితముగా నున్నది. రాజరాజుపైఁ నలుకతో వచ్చిన

యుండనే? రక్షః పీడితవగు నాకలక్ష్మివే? దుర్జాతి భార ఖిన్నవగు భూరమణివే? నాయందుఁ జేరితి వింక భీతిలనేల! పౌరుషంబున సాధ్యమగు నుపకృతి యొనర్చెద, నసాధ్య మునకుఁ దపంబొనరించి యైన మేలు సేసెద. దాపక నీ యుదంతంబంతయు నడుపు మనినఁ దేరిన డెందముతో, విచ్చిన మోముదమ్మితో నమ్మానవతి యమ్మానవపతిఁ జూచి మహారాజ! నీగుణగణంబుల వర్ణింప నేనెంత దానను? ఇట్టివాఁడవు కావున నే, రెండవ శివుండగుకుంభసంభవుండు నన్ను నీకడ కనిచిపుచ్చె. దీనురాలనగు నాయందలి వత్స లతతో మహానుభావుండగు నత్తపోనిధి యందలి బత్తితో సహజమగు నత్వముతో ననధరింపుము. దయాశరధీ! నా పేరు మధుర. నే నొక పురంధ్రిని. నా యునికిపట్టు మధురాపురి. దక్షిణాశాసఘూటీమణి మణిహార లతిక, ఆహారము కుందారమణి సుందరేశ్వరుండు. బహుళ వైభవ మనుభవించిన యమ్మునికికిఁ గాలవశంబున దుర్జనులవలనఁ గలిగిన యిడుములుఁ దలఁచుపాటివియె? అశ్రయాశ్ర యులలో నొకరి బాధ యొకరిది కాదా? కరుణార్ద్రా! వినుచుంటివా? దక్షిణాశ యదక్షిణాశయనయ్యె. సుంద రేశ్వరుం డసుందరేశ్వరుండయ్యె. నా యం దమధురత సాక్ష్యమిచ్చుచునే యున్నదికదా! రాజసింహా! ఇప్పు డప్పురి వ్యాఘ్రపురి యనిన బాగుగా నుండును. ఎంత కష్టము! తన మొదలి పలుకున యోగనిద్రఁజెందిన దను

జారి నుద్విగ్ను నొనర్చు నను భయమున సింహకులపతిసడ
లిపడు నిష్టకలఁ బడగ గప్పి తప్పించు చున్నాఁడు జుమీ!
మ. అకటా! యేమనుదానసాలెపురువు । భ్రాంతమ్మునం బైనస
ల్లికతోఁ గూర్చిన బూజుచాందినిగనో । లిన్నర్క సంవారముల్
వికలత్వంబెనయంగనుండి యటవీ । వేకండముల్ఘ్రిమ్మువం
తకు నెల్లన్నయిరించునోర్పుగజదై । త్యధ్వంసికా! భూవరా!
తే. దర్పకారాతి చుట్టును । త్ఖాతకేలి
సలుపు గజముల తాకోర్చు । శాంతి నొంది
యుండ నుండక ఘూర్ణిల్లు । నూర్ణనాభ
కులము లాయడ్డ పడునవి । కువలయేశ? 44
చ. ఇతరములైన వేలుపులయిమ్మలుఁ గూడఁ గవాటసంపుట
ప్రతతులఁ బుర్వుచేరి తొలు । వస్గ్రృహ సంధుల గడ్డిపట్టి గ
ర్భతలము లెల్లెడ న్విఱిగి । పైఁ బడనున్న దశం దలంచినన్
ధృతి కనకాచలా! గవియు । దేరెడు దుఃఖము నాగశక్యమే?
తే. మున్ను మద్దెల మ్రోతల । ముఖరములగు
దేవళము లెల్ల దిక్కులఁ । దిరిగి యఱచు
ఫేరవంబుల యత్యంత । భీకరంబు
లౌ రవంబులఁ దుములంబు । లయ్యె నిపుడు. 46
చ. మునుతనసంచరించుపొల । మున్మరియాద నతిక్రమించి, పె
ల్చిన బహుజీవనంబు లని । శంబ పదంబుల పాలు సేయుచుం
బెనఁగొని పొంగి చూఱఁగొని । వెన్నడియట్టి తురుష్క
జాతులం । గనుఁగొని సహ్యకన్యకయుఁ । గాఱియ వెట్టెడుం
జూ నరేశ్వరా! 47

ఉ. జన్నములందుఁ దోఁచుపొగ। సౌరభము ల్వెదఁజల్ల నెప్పుడు
న్నున్నత వేదవాదముల। సంస్తవ మందిన యగ్రహారముల్
చెన్నఱి విప్రమాంసముల। చే నధివాసితము ల్తురుష్కజా
త్యున్నతసింహనాదముల। నుద్దలితంబులునయ్యెని త్తఱిన్. 48

తే. ప్రబల నృకరోటికోటిహా। ర ప్రచలిత
శూల పఙ్క్తిపరీతత। నాలికేర
షండఖండన మున మేల్మి। సడలిపోవ
ననరుచుంటిని మధురోప। వనముఁ జూచి. 49

ఉ. ఎచ్చట మచ్చెకంటు లెల। యించెడు నందెలసుందరధ్వను
ల్నిచ్చలుఁ గ్రచ్చుకొంచు రమ। ణీయతరంబుగ మున్ను
దోఁచె నా। రచ్చల నిప్పుడుం దలప। రాని ద్విజాతుల కాలి
సంకెల। ల్వ్రచ్చెడు వీనులం గలగల। ధ్వనితో నృప!
యేమి సేయుదున్. 50

క. ధరణీ నాయక! లూతలు
వెరవున దారములనల్లి। వెట్టిన వలలా
హరిహరి! వింటివె పురగో
పురముల బొమ్మలకుఁ బట్టు। పుట్టములయ్యెన్. 51

తే. ఏగృహాంగణములు చల్వ। లీనుమంచి
గంధపుజలంబు జల్లఁజె। ల్వొందె నాఁడు
నేఁడు చెఱఁబడ్డ సతుల క। న్నీటఁ దడిసి
యవియు నెడద దహించెడు। నవనినాథ! 52

ఆ. చిత్తమంత చెడదు। జీర్ణవనంబుల
ఘూకలోకవికట। ఘూత్కృతులకుఁ

బారసీకభాషఁ । బలుకనెంజలిఁగొన్న
చిల్కలం దలంచి । చెదరె నధిప! 53

మ. జలకేళిం గొనియాడు తొయ్యలుల మే । ల్చందోయి గం
దంపుఁ బూ । తల నొప్పారెడు తామ్రపర్ణిజల మే । ధర్మం
బుఁబోనాడి దు । ష్టులు హింసించెడు గోశతంబు వలన
న్సోలాడు రక్తాంబు ధా । రల శోణత్వముఁ దాల్పఁగా
వలసె భూ । రామా మనోవల్లభా! 54

చ. అమితములైన యూర్పులర । యమ్మున నెండినవా తెఱంగెఁ
శ్లథ । త్వముఁగొని చిక్కువడ్డకచ । పాశములుం
బహు బాష్పవారి పూ । రములఁ బరిప్లుతంబులయి ।
రంజిలకుండిన లోచనంబులై । భ్రమిదుల మోములుండఁ
గని । దారిత మానస నయ్యెద న్నృపా! 55

సీ. అంతర్హితం బయ్యె । నకట వేదవిరావ
మడఁగిపోయెనపో న । యంబుడంబు
ధర్మవృత్తం బార । దారిలేనిద యయ్యెఁ
జారిత్ర పరిశుద్ధి । చదలఁ గలిసె
సుకృతాభిధేయంబు । సొదఁ జొచ్చె నద్దిరా!
యాభిజాత్యం బస్త । మయము నొందె
వెనుకటివలె దేవ । విభుఁడు వర్షింపఁడు
వసుధ యీనేరద । వసుసమృద్ధి
తే. యవనులు హరింప మిగిలిన । యట్టివారి
శమనుఁడు హరింపఁ జొచ్చె న । సమయ మసక

యేమి చెప్పంగఁ గలదు మ । హీకళత్ర
కలి యొకఁడె ధన్యుఁ డీనాఁటి । కాలమునకు. ✓ 56

క. జనపతికి సుదతి యిమ్మెయి
ఘనగర్హితమైన యవన । కథఁ దెల్పు చొగిం
దన మహిమ నొక కృపాణముఁ
గనుపింపం జేసె భీతి । కరమగు దానిన్. 57

సీ. కంచుకం బూడ్చెడు । కాలోరగం బన
వెండి కోశము నుండి । వెడలుదాని
క్షయకాలమున భద్ర । కాళిమైఁ బూయు నా
లాగురుద్రవ కాంతు । లమరుదాని
దాపింఛ నీల మం । తర్దీప బింబమై
మెఱపుతోఁ దొలిమబ్బు । మిగులుదాని
దన మేని చాయల । దహస హార్యము కాని
క్రొత్త చీకటిఁ బాదు । కొలుపుదాని

తే. దానిఁ గనుఁగొని పగవారి । తలఁపుఁబోండ్ల
కనుల నీరెడలించుట । కారణముగఁ
దనకన ద్రోషవహ్నికి । ధ్దామమైన
ధూమ దండముగా నెంచె । భూమిజాని. 58

తే. ప్రణయమున వెంటవచ్చిన । పాండ్య చోల
రమల కర్ణోత్పలావళి । రహిఁ దనర్చు
నాయసివరంబు ముందట । నాహరించి
మఱల నాకోమ వలికె భూ । మఘువు తోడ. 59

ఉ. మున్న ఖిలామరాయుధస ǀ మూహము భాగములం గ్రహించి
యీ । చెన్నున విశ్వకర్మ యసిఁ ǀ జేసి యొసంగఁ బినా
కపాణియుం । బన్నిన దైత్య దానవ స ǀ మాజముఁ
గూల్చి తపంబు మెచ్చి సం । పన్నిధి నైన దీని నల ǀ
పాండ్య నృపాలున కిచ్చెఁ బార్థివా! 60

ఆ. అదియు మొదలుగాఁగ ǀ నాతని వంశ్యులు
దీనిఁ జేతఁబూని ǀ తేజ మెసఁగ
నవనిభాగ మెల్ల ǀ నప్రతిశాసన
ప్రథితి నేలిరింత ǀ వఱకు భూప ! 61

తే. ఇప్పుడు కాలవశంబున ǀ నపగత స్వ
వీర్యులగు పాండ్యవంశ్యుల ǀ విధ మెఱింగి
మానవేశ్వర! నీకు నీ ǀ మండలాగ్ర
మర్హుఁడ వటంచుఁ బంచె ఘ ǀ టార్భకుండు. 62

చ. దురమున దీనిఁ దాల్చి యతి ǀ దుస్సహ తేజ మెసంగఁ గా స్వభా
వరుచిర సాహసుండ! రిపు ǀ వర్గ మడంచుట యెంత పెద్ద నీ
కరయఁగ వేసవిం బహువ ǀ నావళులేర్చు దవాగ్ని మారుతా
దరణము తోడుగా నొకని ǀ దర్పము మెచ్చునె భూపురందరా!

ఉ. సంగర రంగమం దెపుడు ǀ సత్త్వము వోవదు దీనిశక్తిచే
నంగముఁ జేరి చక్ర ముస ǀ లాసి గదాదులు నొంపలేవు దీ
నిం గొని నెత్తుటం దడిపి ǀ నింగిఁ దటిచ్ఛట కీడు జోడు నా
భంగి నటింపఁ జేయఁగన ǀ వచ్చునె కాలున కేని నిన్ను నిర్ఖ.

తే. దక్షిణంబైన మధుర యం ǀ దలి నృశంసు
గంసు మాదిరి యవనేశుఁ ǀ గాసిపఱిచి

మహితబలమునఁ బాధిప । మండలమునఁ
గృష్ణు నవతార మసియెడు । కీర్తిఁ గొనుము. 65

తే. ఇతరులు మనంబుతోఁ గూడ । నెనయరాని
మూఁడు జగములఁ బాలింప । మొనయు దీక్ష
కై యొసంగిన కటకంబుఁ । గరమునందుఁ
గ్రొత్తఁగ ధరించుచుంటివే? । కువలయేశ ! 66

మ. విపులశ్మశ్రుకము ల్మృగేంద్ర నినద । స్ఫీతంబు లుద్రిక్తర
క్తపరీతాక్షికముల్త్రిరస్త్రయుతము । ల్తాళిసానహ భ్రూకుటీ
కపటస్ఫూర్జిత ఫాలముల్ హతతుల । ష్క్రేణిశీర్షంబు లీ
విపులన్వేగ మలంకరించెదుగతి । వీక్షింపు మూర్వీశ్వరా !

క. భవదీయ విక్రమాప్యుఁడు
గవలించెదుఁగాత జన్య । కల్యంబున నా
నవహాస మన్ప్రదోష(ఫ)
యుమనసిస్మిత చంద్రికా మ । హో వికసనముల్. 68

క. వినయాభావ దవానల
మును ధర్మాభావ ఘర్మ । మును గూర్చిన భూ
వనిత పరితాప మాప్పమ
యనిఁ జచ్చిన పగఱనెత్తు । రను తోయమునన్. 69

శా. ఆపల్గాకలరక్తమాంసములు క్ర । వ్యాద్భూతభేతాళ ర
క్షోపస్మారపిశాచముల్తనియ నా । హారంబుగా నియ్యసిం
బాపై కప్రవణుందుప ష్క్రవిభు వి । శ్వద్రోహి హింసించి సం
స్థాపింపన్వలె రామసేతువుదరి । న్స్వామీ!జయస్తంభముల్.

మ. అవనీనాయక ! బాహుశాలివగునీ। వారంభముం బూనిసే
తువుఁగట్టింపఁ గవేరజాకరిణియుం। దూర్ణంబవేగంబుఁబా
సి వినోదావహ యానలీల లెసఁగ। న్సేవించుఁ దద్రాజల
క్ష్మీవరించుమ్మని యానఁజేకెదు శుభశ్రీలెల్ల వేయేటికిన్.

క. అని పలికి మండలాగ్రం
బును జేతికొసంగి రాజ। పుంగవ! సెలవా?
పనివినియెదఁ గనుఁగొనియెద
నిను మఱలం గన్నులార। నిహతారిచయున్. 72

తే. అనుచువిభుమోముఁజూచుచు। నరిగె గరిత
మేదినీపతియప్పుడ। మేలుకాంచి
యర్హాకృత్యములందీర్చి। యాప్తజనులఁ
జేర్చి రాత్రిచరిత్రంబుఁ। జెప్పిపిదప. 73

మ. హితులారా! కలకల్లయన్ననుడికా।దిచ్చోటఁజూటలఁగా
చితిరేకుంభభవుండుపంపినమహా। సింగంటిమే యుట్టిపి
క్షితిలోరుద్రునిసామ్యమటన్ననగుఁ బో। కీర్త్యంబనైనాడన
మ్మతినేనింతయు మోసమున్నఁజెపుడా। మీమీయభిప్రా
యముల్. 74

తే. అనిననందఱు నేకవా। క్యముగబలికి
రయ్యా! జయమగుఁ గాత మీ। యమ్మకమువ
చల్లఁగా నెల్లవారికి। సౌఖ్యమబ్బుఁ
గాత! నినుఁ బోటి కిట్టివి। కానిపనులె? 75

మ. మునుమున్నాడి యయోధ్యరామ సుతుఁ గొం। పోలచె
పేర్మింజగం। బునఁ ద్వాదృత్యులు కారణాత్రజనను। లోప్

ధమన్యసామాన్యులే? । జననాథాగ్రణి శస్త్రాయుధ
మునో జందాల్పఁగా జెల్లు వి। ఘున కే కాక సుత్రాక్షఁ
డర్వాఁడెమును లూర్చింతుఁ జేతగన్. 76

తే. యవనపతి సామమును విన దగును బోరు
కలనఁ గెలిచెదవీవు ని క్కము కుమార!
యేది యెట్లైన నొకదూత నూదిపలుక
నేర్పుగలవానిఁ బుచ్చుట నీతిమనకు. 77

మ. అనినన్మెంచిదియంచు మెచ్చిపతి శౌర్యౌదార్యగాంభీర్యము
ల్గనవే యన్నటులున్న వానిఁ దపుణు దగోజ్జ్వలుం
గేరలా। వనినాథాత్మజుఁ జూడ వాఁడెటేఁగి దే వా!
పోయిరా నేర్తునీ। పని సాధించెద నన్నుఁ బంపుమని త
ద్భావంబెదం గొల్పుచున్. 78

క. తగురీతి మాటలాడెదఁ
బగతుఁడు లోఁబడిన మేల ప్రబలినమఱి సం
యుగము సమకూర్చి వచ్చెద
నాగి సన్నాహంబుఁ గూర్చు చుండు మధీశా! 79

క. అని సందేశంబును మదిఁ
గొనియాతఁడు కడచి మధుర కును జని యవనా
వనివిభు నాచితితోడం
గని వాఁడడుగ న్వచింపఁ గాఁ దొడఁగెనిటుల్. 80

మ. యవనాధీశ్వర! విన్ము నేను దురిత వ్యాపాది కర్ణాటభూ
ధవ సూనుండగు గంపరాయ విభుదా త్యంబాత్మ గీ

ల్కొల్పి ని । స్నవలోకింపఁగ వచ్చినాఁడ ననసనే । లాయుమా
రులుం బేరులీ । వనధానంబున నుంటివే యొడల స్వా ।
స్థ్యంబే హితుల్ యుక్తులే? 81

క. ఈ దేశపు మర్యాదల
నాదరమింతైన లేక । యన్యాయముగా
మేదిని నేలెద విదిమన
యోదనమున కా? నృపాల! । యొదవిసదాదిఁ. 82

క. నీ చెడుగుఁ దనము దేశము
నీచత్వం బెనయుటయు వి । నిందిత గతియై
యాచారము చెడుటయు విని
త్రావనఁ గోపించి పనిచె । రామ్మణిసన్ను. 83

క. ఇక్కడివారలు కొందఱు
కక్కసమునఁ బోయి నీవి । కారము లెల్ల
న్నొక్కి పలుకంగ రుద్రుని
పెక్కువతెన మూనె నకట । పృథివీశుంచుఁ. 84

సీ. కాంచీపురము వద్ద । కలిగిన కలహంబు
రాజ గంభీరంబు । రాపు వహుటు
సపరిచ్ఛదంబుగాఁ । జంపేంద్రుఁ జంపుట
యేటఁ గవో ప్రాణంబు । లింపుగావో
కర్ణాట నరపతి । కారుణ్య పాథోధి
యాశ్రయించిన నీకు । నభయ మొసఁగు
దేవ ద్విజన్ములు । గోవుల హింసింపఁ
జనదు పరస్త్రీలఁ । జెనకరాదు

తే. పొదువుఁ గోసినఁ బాల్ద్రావఁ । బోలు నెట్లు
ప్రజల హింసించి గాజేమి । బావు కొనెడు
నల మహీపతి శాసన । మనుసరించి
యేలుకొను మీవ యీనేల । నింతయేం ? 85

శా. లేదా ! యూరకపోదు నీదురితమో । లిస్సర్వసౌఖ్యంబులీ
లోదాత్మ్యంబునఁ బొంది బొందియసువు । ల్మంజేతఁ గీలించిపృ
థ్వీ దారాగ్ర కరాంచలోగ్ర నటనో । ద్వృత్తారి వీరాసృగా
స్వాదోన్మద్యదసిద్విజిహ్వమునకు । న్భక్ష్యంబవై పొమ్మికన్.

మ. అనినం గ్రుద్ధకరాళవక్త్రుఁడయికో । శాకృష్టఖడ్గుండు యా
వననాథుండు విలోచనాంచలముల । న్వహ్నిస్ఫులింగాళి రా
ల్పనిజాప్తాస్యములట్లయుండనదియె । ల్లంజూచి కేలాచి, రా
జనసింహా ! యని పిల్చిడాచితనహో । షంబిట్లనెన్నావితోన్.

తే. చిలుకలుం బోలె వీసులు । పలుకుమనిన
పలుకుఁ బడులనె వాక్రుచ్చు । వారుగాని
దూతలకు స్వార్థమున్నదే ? । భూతలేంద్ర !
యెదిరికవ్వాపునఘ్యలే ? । యిది యెఱుఁగవె ? 88

ఆ. రాకొమారు నడుల । రాణఁ దెల్పుచునుంటి
నిపుడు రిత్తబీర । మేల ? మనకు
నీదురాజసమున । నెఱిదప్పెఁ బునరుక్తిఁ
బలుకవలసె సైప । వలయునయ్య ! 89

క. గోవధము మాని భూమీ
దేవుల తెసువునకుఁ జనక । దేవాలయముల్

కావరమునఁ బడఁ గొట్టక
నీవేలిన మేలకాక । నేలయొకంటకున్. 90

తే. ఊరుఁ బల్లెలఁ జేరక । యొటగియుండి
పుడమి పన్నుల మాత్రము । ప్రోవుసేసి
కొనుచు నూకరి వెట్టుచు । కోపముడిగి
మానవతులను జెనకక । మనుముసీవు. 91

క. ఈ సన్మార్గంబున నడుచుట
యేమారుపు గలిగెనేని । నేమువిధింపం
గా మొనయుశిక్షఁ జెందఁగ
నీమది నిశ్చయము సేసి । నెగడినఁ జుమ్మా? 92

శా. ఈ నిర్బంధము నాకు నేలయని పో । నీపూని పోరాడనే
రా నెంతేనదిలెస్స మామక భుజా । గ్రవ్యగ్ర ఘోరాసిధా
రానిర్భిన్న గళుండవై చనుము ధీ । రత్వమ్ము వాటించియా
శౌనాశీరు పదంబునన్నిలువ వాం । ఛల్గినసీ కున్వకీ.

క. ఈ యుభయమును రుచింపక
పోయిన వేయేల గర్వ । మును భోగేచ్ఛం
బాయ విడిచి కుజనుల కగు
నాయూ వనములకుఁ బొమ్ము । యూననవిభుఁ డా! 64

తే. అనుచు విస్పష్టముగఁ । బల్కి యతఁడు సతని
వారు నేమనువారో నీ । వారకంబుఁ
దెలిసికొమ్మనె నృపుఁ డేనుఁ । దెలుపు కొంటిఁ
బోయివచ్చెద నేమిచె । ప్పుదురు మీరు. 95

మ. అనిన న్మీసలువచ్చెహిందువులకొ । రా! పట్టి కట్టుఁడు వీ
నిని తర్వాత నతండె వచ్చెకనుఁ బో । నిర్ఘాతసంఘాతసం
జనితాగావధనుర్విముక్తశరసం । ఘన్మాత్ముఁడై మాచలం
బునువిక్రాంతిబలంబునంచువడినిప్పుల్ ప్రాలుకన్గోయితోఁ ఱ

తే. కత్తివెఱికెడు సుల్తానుఁ । గాంచిలేచి
బద్ధపరికరుఁడై చుట్టుఁ । బాఱుతెంచు
చున్నసామంత నృపతుల । సన్న లెంచి
చొప్పు తప్పెనటంచునా । శూరవరుఁడు. 97

మ. బలశాలీ! తగు దూతలం బొదున నీ । వాక్రుచ్చుసందేశ
వా। క్యాలనల్మా చెవికిఁ లభింపవు కదా! । కానిమ్మ
దోశ్శాలి! నీ। బలగ మ్మెల్లెడఁ గ్రమ్ముదెంచె నల కం ।
పత్యాత్మతలేం ద్రుండుపై। సెలవీలేదని జంకుచుంటి నిది
యుం । జిత్తంబునం జేస్పమా. 98

ఆ. నీదు పాపఫలము । నీఁదలంచె విధాత
వచ్చుచుండవచ్చు । వనజనాభు
నంశమైన రాజ । హర్యక్షుఁ డలకంప
రాజశేఖరుండు । నాజిఁగోరి. 99

క. సన్నద్ధుఁడవై యుండుమ
యన్నా! వచ్చెదము సెలవు । లా నాకివొచ్చె
మన్నీలోక మెత్తా! చను
చున్నాడను కాచికొను మొ । హా! నీవారిఁ. 100

తే. అనుచుఁ దనుముట్టవచ్చు న । యన్వన బలము
వెడ్డువెట్టి తొలంగి య । వ్వీరవరుఁడు

వచ్చి యవ్వార్త లెఱిగింపఁ । బార్థివేంద్రుఁ
డదరిపడి సేనలకు దాడి । కానయిడిన. 101

సీ. దూరగ సంభిన్న । తురగహేషా ధ్వని
వారణావార్య ఘీంకాం । ర రవము
రథ్యావిపర్యస్త । రథనేమి నినదంబు
పత్తిత్వరా సమా । పత్తి నాద
మన్యోన్య వీరవ । రా కారణాక్ష్వాణ
మతివేల సంభృత । ప్రతి విరావ
మూర్జ్వసురాశీ స్స । ముత్థ నిస్వానంబు
చారణ స్తుతిసంస్తు । తా రవంబుఁ
ఆ. దోడుగాఁగ నెగడె । దోధూయమాన క
ల్పాంత సింధుకాంత । దంతురాతి
రాన నిబిడతరధ । రానభోంతర భాగ
భేది భేరికా ప్ర । ణాదనంబు. 102

శా. పాతాళావలకండ్లకుంజెవుడుని । ర్వాహించిన్వస్సచ్ఛమూ
చేతోవ్రాతమగల్చిసంధు లూగి వి । చ్ఛిన్నంబులై పోనజాం
డాతీతంబయి యుగ్రభైరవ సహా । స్రాహీన సింహా రవ
భ్రాతృత్వంబు వహించి మించె దర సం । పాద్యానక
ధ్వానముల్. 103

శా. సామంతుల్పరివారయుక్తముగ ను । త్సాహిల్లికై సేసి యు
ద్దామాటోపముతోడనాయితముగాఁ । దత్తజ్జన స్తోమముల్
సామగ్రు ల్సమకట్టు మండ నగరీ । చంద్రాస్య యుద్రిక్తమా
స్వామి ప్రేమకు నీడుగా మెలఁగఁ ద । త్పంసిద్ధినుద్బుద్ధుఁడై.

తే. మంగళాలంకృతుండగు । మానధనుఁడు
సతుల జయజయ శబ్ద వి । స్తరము వినుచు
నాంగిక నిమిత్తముల నెంచి । యలరు మోముఁ
దమ్మితో నెక్కె భద్ర దం । తావళంబు. 105

క. శ్రేయస్సముదాచారత
నాయెడఁ గర్పూర మంగ । ళారాత్రికలం
దోయజముఖు లెదురుకొనన్
రాయఁడొసఁగె వారికెన్న । రానిబహుమతుల్ 106

ఉ. అంతటయానమంగళము । లాత్మకునుత్సవముంబొనర్ప భూ
కాంతుఁడు రాజమార్గమొడి । కంబుగఁ జేరిన మేడలెక్కి సీ
మంతినులాదరంబెసఁగ । మావిభుఁడేచి జయించుఁగాతకా
లాంతకర ప్రతాపమున । నంచొగి సేసలుజల్లి రెల్లెడన్.

శా. తూర్యారావము లుల్లసిల్ల బలసం । దోహాబ్ధికౌతూహలా
వార్యస్పర్శన చాలితంబగు యశ । ర్యప్రౌఢిమిన్నందగా
శౌర్యాంభోనిధియైన కంపవిభుఁడా । సామంతభూకాంతుల
న్మర్యాదల్దగ నాదరించి భటుల । న్మానించిసాగించినన్.

సీ. అడుఁగడుఁగున నుర్వి । యడఁపు సైరించుఁగా
కోదరపతిఁ గ్రిందు । మీఁదు సేయ
మార్తాండ బింబంబు । మాటు పుచ్చి రజంబు
సురలకన్నులనిండి । మెరమెరమన
నేడు భూధరములఁ । బీడించి భేరికా
భూరి భాంకారంబు । భోరుకొనఁగ

హేతిధారామహో । ద్యోతముల్లయకాల
విద్యుద్ద్యుతులయల్లి । బిల్లిఁ బెఱప
ఆ. నడువఁజొచ్చెనధిక । నరగజ వాజి ర
థప్రధానవాహి । నీ ప్రవాహ
మెదురులేక లోక । మెల్లఁ గీర్తింపఁగా
భీమకాంత యాన । విభ్రమముగ 109

శా. ఆరాజన్యుఁ డనన్య వైభవముతో । నాగస్త్య దిఙ్మార్గ మం
దీరాణ న్వడిఁబోయి పోయి యవనా । ధీశుం డనీశుండుగా
గారా మొప్పఁగ సేతుబంధనమునం । గావేరి దాటించి సే
నారత్నాకరపూరమున్మధురస । న్నాహంబుతోఁ జేర్చెనర్.

క. రాకలు పోకలు నడిగెం
జేకొనరావయ్యెఁ దమకుఁ । జేరెడు ధనముల్
వాకిళ్ళు మూయఁబడె రథి
నీ కలితాటోపములకు । నిలువఁగ రామిన్. 111

క. పంజిన మూకలు ముట్టవె
సంజెడు వప్రమును యవన । జనపతి గని లో
నెంజలిఁ గొని యదిరిపడెం
గుంజంబునఁ జిక్కువడ్డ । క్రోష్టువలి వీకన్. 112

శా. అంతం బంతములూని దుర్గముల హా । హాకారము ల్వొట్టవి
క్రాంతుల్బొబ్బలునార్పులుం జెలఁగఁగాఁ । గర్వాఢ్య యోధు
ల్చయ । ప్రాంతంబు ల్వడిఁబ్రాకి యుద్ధవిడిఁ ద । త్ప్రత్యర్థి
సార్థంబు న । త్యంతంబు న్వెఱఁబాఱఁ దోలుటయుఁ గ్రో
ధంబై తురుష్కేశుడున్. 113

శా. ఏమీ! హిందువు లింతవారలయి రా! యీనాఁటనాత్మోడసం
గ్రామంబుం దలవెట్టి రింకఁ దడవం గా నేల యీ నేల మే
దోమాంసాసృగపారపూరములనీ దుంబోపిశాచౌఘముల్
సామర్థ్యంబున ముట్టికొట్టుఁడరులన్ సామంతులారా! యనన్.

వ. అని యివ్విధమ్మున నంబునిధి కైనవచ్చు నిజధ్వజినిం గాని యూడి యానయిచ్చి రణదుందుభులు మ్రోయించి సన్నద్ధం బగు దురగం బధిరోహించి మించినకుతుకమ్మున నాత్మ తమ్ముల నెంచక దక్షిణద్వారమ్మున వెడలి కడువడి సుడి వడు వెడమూకల వెంబడిఁబడి కొల్లలు సేయుచున్న యన్నరాధిపు వార్త విని కంపభూనిలింపనాథుండు తన వరూథిని నేకముఖంబు సేసికొని యెదుర్కొనుటయు, నత్తొలితాకునఁ బదాతులు పదాతులఁ గరులు గరుల హరులు హరులఁ దేరులు తేరుల నెనసి వింతగాఁ గొంత సేపు పోరి పదంపడి యన్నియమమ్ము నిలువమి నావే శంబు వచ్చిన రీతిఁ బొంగి యయ్యుర్వారువాగును తన కడ్డమైన చతురంగ బలంబు ననర్గళ ప్రసారంబగు బాహువిక్రమంబున సమయించి యద్భుతం బాపాదించె నాసమయంబున.

సీ. దుందుభి క్వణమున ద్రుహిణాండ మగలెఁ బో
తూర్ణపరాగము రేఁగి మాటి వైచె
బలముల సందడిఁ బ్రబలెఁబో యుష్ణంబు
కరికరాంబువు లేచి కప్పిపుచ్చెఁ
బడగల నీడలఁ బరగెఁబో చీకట్లు
చూడామణుల వెల్గు చుట్టివచ్చె

గుఱ్ఱాల గిట్టలఁ । గ్రుంగెఁ బో మేదిని
యాయుధంబుల పొడు । లందుఁ జొచ్చె

ఆ. నారి భర్మగర్భుఁ । డమరిచియుంచెఁ బో
బోసికర్వామైన । మూసిగలిటు
కాని పుడమిఁ బడెను । కరినరజాతుల
ప్రిదులు నాయువునకు । నడుకులేద. 116

వ. అప్పుడు కొందఱు పలకలతోఁ బరుల యలుగులవానలు వారించుచు నెఱుఁగరాకుండఁ గత్తులు విసరి వారి తురంగమ్ముల చరణమ్ము లెల్ల నొక్కుమ్మడి నఱికి పగసాధించిరి. మఱికొందఱు జాఱిపడిన కైదువులఁ గొనునంతరము లేక మార్తుర మూఁపుమాప భీము ననుకరించిరి. వేఱ కొందఱు తమ యాయుధంబులు ధానుష్కశరకృత్తంబులయి నదంతావళంబుల దంతంబులు వెఱికి త్రోపాడఁ జొచ్చిరి. ధానుష్కులశశాంకశకలాకార కాండంబులఖండితములైన శుండాల శుండాదండంబులు కుండలీంద్ర కులంబులు పారిక్షితుసవనాగ్ని కుండంబులం బలె రక్తహ్రదంబుల నద్భుతంబుగఁ బడియె. కృపాణ పాణులచేతం భిన్నములగు గుంభి కుంభములనుండి రక్తసిక్తంబులై యున్ముక్తంబులైన ముక్తాఫలంబు లుక్కుతునుకలుంబోని వీరవరుల సంఘట్టనమ్మున రేగిన రవ్వలను భ్రాంతిఁ గలిగించె. ఒక్క యాశ్వికుఁ డొక్క దంతావళము తలఁ బ్రద్దలుసేసి సత్వరముగఁ దిఱుగునంతలో నది వాహనముతోఁ గూడ వాని నేలంబడవైచి పాదఘట్టనముల మూఁపుమాపె. మఱి

యొక్క దంతిపోతము కత్తివిఱిచి ప్రతివీరుని పాదములు
పట్టి దూరముగాఁ బైకి విసరివైచి పడునెడకుఁ దనదశన
ద్వయమునెత్తి గుఱిసేసి మడియించె. నింకొక గజపతిచే
నెగయవేయఁ బడిన యసిద్వితీయుండగు తరస్వి దానిస్కం
ధమ్మునం బడి హాస్తిపకునడచి స్వయముగ గజాధిరో
హుఁడై మార్తురయెదుటఁబరాక్రమించె, నత్తఱిఁ గొందఱు
రక్కసులు భిన్నకుంభములగు కుంజరంబుల క్రొత్తనెత్తు
రుత్పుష్కరనాలదండములతోఁ బీల్చి ముత్తియము లుమి
యుచు సంతసమునఁ ద్రావిరి. చక్రాయుధ ములచేఁ
దెగి కందని కాంతిగల యోధోరణుల మూర్ధంబులఁ
గ్రింద పడక మున్న ముగ్ధనిశాచరాంగన లవతంసార్థ
మేరికొనిరి. జిఘృత్సతో నంతఃప్రవిష్టములగు పతత్రు
లచేఁ గదలుచున్న ద్విపకుణపమును సమీపించి సతృష్ణ
మయ్యు నొక్క సృగాలమ్ము సజీవబుద్ధిఁ దొలఁగి చనియె.
గోషణుఁడగు ద్వేషణుడు పృషత్క సర్షంబు దన్ను
నిషూదింప నిలింపతె నెనసిన యొక మానవుఁడు పెద్దగఁ
గొనియాడుచు నతనిపై సహర్షముగ బుష్పవర్షములఁ
గురియించెను. తనచేతి కుంతమున భేదింపఁ బడియు నెది
రించి తన యురస్థలంబుఁ బ్రద్దలు సేయుచున్న ప్రతివీరు
నొకవీరుడు మెచ్చుకొనియె. గుణములయందలి మచ్చర
మెవ్వరు వహింతురు! ఒకానొక భటద్వితయము చిరకా
లము పోరాడి యన్యోన్యాసి ఖండితోత్తమాంగమై బొంది
విడిచివెంటనే మైత్రి మెఱయదివ్యపురి బొందె. సంగ్రామ

కానన మెల్లఁ జుట్టి వచ్చుచు దర్పోజ్జ్వలులగు నరపతి మృగపతులు కొందఱు ప్రత్యర్థి పార్థివ కుంజరంబుల మూర్ధంబుల వాడిగల కొనగోళ్ల భంజించిరి. ఇంక ననేకు లనేక భంగులఁ బోరాడుట కనిమిషులు సంతసించిరి, కాని యా సందడి కయ్యం బితరుల కెట్టిదని వర్ణింపరాని దయ్యె నట్టియెడ.

మ. తనబీరం బరివీరులుం బొగడ ను। త్సాహ స్ఫుర న్మూర్తియై
జననాథాగ్రణి చిత్రసంగర విధి। త్వని ర్మించియె-చ్చోటఁ జూ
చినఁదానై ప్రలయాబ్ధిమత్స్యపతివా। సి న్వాఁజవర్తింపఁగాం
చనపుంఖప్రదరంబులంబఱపియు। త్పాదించెఁదత్సైన్యముల్.

క. ఆవిభుని వాజిరాజము
ఖావని ఫేనంబుమెఱయ। నాలములోనం
జేవసెడి పాఱువైరి మ
హావీరుల నవ్వుచున్న। యనువునఁ దోచెన్. 119

మ. ఇభము ల్దగ్గతులు న్సకంకటముగా। నేకప్రహారంబుచే
నభితో భిన్నములైన దేహములను। న్నట్లున్నచో ల్లెల్లఁద
ద్విభుమూర్థన్యవిమర్దమార్గము లెసఁ। దేహంబు లేదంచుదుం
దుభు లొక్కుమ్మడి మ్రోసె నాకసము నం। దోరంబు
గాన త్తఱిన్. 120

శా. వీరుల్వాలుఁగృపాణపాణియయిస్వ। ర్వీథిన్సురల్మెచ్చగా
నారాజన్యుఁడు కుంభికుంభ తటని। ర్యద్రక్తపూరంబుము
క్తారత్నంబులుదోయమున్సికతలుం। గాసంగరక్ష్మాస్థలిన్
శ్రీరంజిల్లఁబరశ్శతంబులు సృజిం। చెం దామ్రపర్ణీనదుల్.

క. తత్తోమర నుత్తములై
ముత్తెములంగురియుద్విరద । ములు గుహాశక్త్యా
భిత్తమయి హంసకుల సం
పత్తినెనయుక్రౌంచగిరివి । భం గబళించెన్. 122

తే. మించిసత్వర మెదిరించు । మృగకులంబు
నాతరక్షువు కొనగోళ్ల । నడచుభంగి
వీరవరుఁడేచి యరాజు బ్ర । వీరహృదయ
ముల నలగఁగొట్టె ఛురికా స । మూహమేసి. 123

తే. రాజమార్తాండుఁడరుల శి । రస్త్రయుతము
లుద్ధత విలోచనములైన । యుత్తమాంగ
ములు శరీరంబులోనికి । మునుఁగఁ బొడి
ముద్గరంబున రణకేళి । పొలుపుసూపె. 124

శా. నానాయుద్ధవిధిజ్ఞుఁడై విభుని నా । నాహేతిజాలంబులన్
నానావైరిచమూసమూహములు వి । న్యస్తంబులై
తత్క్షణం। బానద్ధక్షయకాల హవ్యవహ దీ । ప్యజ్జ్వాలికా
మాలికా। దీనాంభోనిధి వారిపూరముల మా । ద్రిన్రూ
పఱెంబెంపఱన్. 125

ఉ. రాముఁడు సేయఁ డింత భృగు । రాముని మాటకుఁ బూట
యొద్దియు। ద్దామ రణప్రకాశుఁడు పృ । థాసుత మధ్య
ముఁడేనిఁ బూనఁ డా। భీముఁడు కొంతకొంత తని । విం
గలిగించెనుగాని నాఁడు నేఁ। డీమహిజాని పెంచెఁగల ।
హేప్సితుఁడైనమహర్షిహర్షమున్. 126

ఉ. పోరునఁ బోలు నాత్మబల । ముం గని వజ్రినివృత్రుఁడట్లు ని
స్ఫారిత ఘోరశార్ఙ్గుఁడయి । పార్థివుఁ బైకొన్నవాని వీరపా
టారుణనేత్రభ్రూకుటిభ । యంకరఫాలుఁ దురుష్కపాలుఁ ద
ద్వీరులు మూర్తమో మదమొ । విగ్రహమో యని
యెంచి రాత్మలన్. 127

తే. అశ్వరయమున వానిని । రాయతమణి
గణవతియునైన వేశీ ప్ర । కాశమొనసె
నుండఁబోవుచున్న య । మర్త్యవహ్ని
రవ్వ లెగసెడునల ధూమ । రాజి యనఁగ. 128

తే. వానిచే నతిగాఢమా । స్ఫాల్యమాన
మైన శార్ఙ్గంబు నూర్వీమ । హానినదము
చిరమునకుఁ దావువిడిచిపోఁ । జెలయుచున్న
జయకమల నూపురధ్వని । చంద మొందె. 129

క. పరిగత బల్లాలనముం
బరాక్రమ పరాస్తచోల । పాండ్యప్రభు సం
గరసమ్ముఖు యవనాధిపు
గని విక్రము డెదుకోనిమెఁ । గంపవిభుండున్. 130

శా. ఆకర్ణావని కృషకార్ముకులసం । ఖ్యాకాయుధ శ్రేణికా
వ్యాకీర్ణాఖిల దిగ్విభాగకులు వీ । రాగ్రేసరుల్ స్వస్వదోః
ప్రాకట్యప్రతి రూపమైన ప్రధన । ప్రావీణ్యముం జూపిర
ప్పాకర్ణాట తురుష్కనాథులభి మా । నార్థంబుపై నర్థితోన్

మ. అవనీశానుఁడు వేయుబాణములు ని ర్యాతంబులై తాకె న
య్యవనేశానుని గాలరాత్రియతి ఘో రాలోకనంబుల్వలెన్
యవనేశానుఁడు వేయుబాణములుని ర్యాతంబులై తాకె న
య్యవనేశానునివీరలక్ష్మినవలీ లాలోకనంబుల్వలెన్. 132

సీ. వలచి సౌఖ్యముఁ జెంద వచ్చిన జయలక్ష్మి
సంగతి నౌ నఖ క్షతము లనఁగఁ
బారసీక ప్రభు బాణజాలంబుల
నౌ క్షతంబులు విగ్ర హమున మెఱయఁ
గేరళేంద్ర ప్రాణ మారుత భుజగమ్ము
లంధ్రాంధకార స హస్ర ఘృణులు
వన్యావనీశాన వనదవానలము తా
ప్రదరమ్ములన్నాని మదమడంచి

తే. మించి జయకాంక్షితము తోడ మేల్మి మెల్ల
సడల సాహసోత్కలీంద్రు శీ ర్షంబుఁ బోని
యంబరంబంటు ధ్వాంత ధ్వ జంబుఁ గూల్చెఁ
గల్పకాలాంత రుద్రుఁడై కంపరాజు. 133

క. కన్నుల నిప్పులు రాలఁగ
నన్నేతయు నదరిపడి మ హా మర్షముతో
మిన్నని మన్నని దెసలని
యెన్నఁగ రాకుండఁ గురిసె నిషువర్షంబుల్. 134

మ. తలరింతేనియులేక చిర్నగవుతో ధాత్రీకలత్రుండు న
య్యలుగుల్మాన్పుచుఁబారసీకవిభురా జ్యశ్రీకినూ రేండ్లమం

గల సూత్రంబునుఁ బోని వింటిగుణము ఖండించి తోడ్తో ననే
కఃసత్కాండపరంపరల్వఱపెఁ జే కాలాడకుండ న్వెసన్. 135

శా. అంతంబంతము రోషము న్నయయవాఁ డా శాస్త్రము న్వైచివి
క్రాంతుండౌఁ బ్రలయాంతకుండనఁ దురం గప్రోతపర్యాణవ
ర్ధ్రాంతాబద్ధ విలంబి కోశగతమా నమ్మండలాగ్రంబు ని
శ్చింతుండై కొని మేను వెంచి జళిపిం చన్వేలుపుల్భీతిలన్. 136

శా. కంపత్కూర్మతలనాథుఁడుం గొనియెఁ ద త్కౌక్షేయక
వ్యాలమ్మున్ । శంపాజాల విభావిశాలము సగ స్త్యప్రీతి
వాచాలమ్మున్ । సంపృక్త ప్రతివీర వంశదహన జ్వాలా
మహా భీలమ్మున్ । సంపన్నిర్జిత శూలి శూలము జయా
శా పూర్తి సంశీలమ్మున్. 137

తే. దురములో వాని విషజాత ధూమ్రకాంతి
యైన కరవాల రేఖ క రాగ్రధూత
యగుచు యవనాధినాథుఁ ప్రా ణానిలములఁ
గ్రోలు భుజభుజగము నాల్క వోలి నాలిచె. 138

శా. ఆ కర్ణాటకులప్రదీపుఁ డుపవా హ్యప్రౌఢిసాహ్యంబునన్
వీక న్వచ్చు విరోధిచేతి యసి సం వేగంబు వంచించి స్వ
ప్రాకట్యంబు సుర ల్నుతింప నిమిషా ర్ధంబందు ఖండించె స
శ్రీకంబౌ యవనప్రధానుశిరముం జేకొన్న దివ్యాసిచేన్. 139

కం. ఎఱుఁగదు సేవా వచనము
లెఱుఁగదు దేవతలకైన నెప్పుడు నిపుడో
ప్పఱినేలఁబడియె నౌరా !
తఱియగుడుఁ దురుష్కనేత తల యచలంబై. 140

మ. ప్రమదాపాది తురుష్కరాజ్య పదవీ పట్టాభిషిక్తంబు శీ
ర్షమిలండుల్లిన వామహస్తమున న । శ్వంబు న్నియన్త్రిం
చుచు । న్విమతుంగెల్వఁ బరిస్ఫురించుకరమా । వేగంబు
సూపంగను । న్న మహావీరుకబంధముం బొగడె భూ ।
నాథుండు చిత్తంబునన్. 141

ఉ. మానసమున్నతం బయిన । మానవనాథుశిరంబుమీఁద స
మ్మాన పురస్సరంబుగ న । మర్త్యవధూకర పంకజాత సం
దానిత పుష్పవృష్టిపతి । తంబయియొప్పెస్వయంవరోత్సవ
శ్రీనిచితాక్షత ప్రకర । సేచనమంచుజనంబులెంచఁగన్.

తే. శాంతదావాగ్నియైన వ । నాంతలక్ష్మి
గ్రహణదోషంబెడలి యున్న । గగనకమల
యస్తమదకాళియాహి యా । యామునరమ
క్షతయవనయైన దక్షిణా । శం దలిర్చె. 143

సీ. పాదావనతులైన । వైరివీరుల హత
శేషుల నపుడు ర । క్షించి మించి
స్వజనంబులకు నెల్లఁ । బసదనంబు లొసంగి
బహుజయస్తంభము । ల్పాదుకొలిపి
వేల్పుల విప్రుల । వృత్తులు పరికించి
రమణీయముగ నుత్స । వములుఁగూర్చి
సామంతులకు వారి । సామ్రాజ్యముల నిచ్చి
పౌరుల వృద్ధుల । గారవించి
తే. యర్థిఁగైసేసి తనరాక । నరయుచున్న
యన్నగరిఁ జొచ్చి మెచ్చి కం । పావనిపతి

శ్రీదలిర్పఁగఁ బట్టాభి । షిక్తుఁడయ్యె
బంధుజనులకుఁ గన్నుల । పండు వగుచు. 144

మ. తలిదండ్రుల్ విలసిల్ల మిత్రతతి మో । దంబంద ధర్మంబు దె
క్కలివాయందగ నర్థముం గొలువఁగాఁ గామంబ వామంబుగా
నిలయు న్నాకముచేతిలోనిదిగఁ గం । పేశానచంద్రుండు భూ
తలమేలె న్నతులుం గృతార్థులుగ ని । త్యశ్రీసమాశ్లిష్టుఁడై.

క. వాసలు తఱితోఁ గురియుచు
మాసుగ సస్యములుఁ బండె । మనుజులు సుఖ సం
తానమున మిగిలి క్రతువుల
దానంబుల నాదరింప । దైవము మెచ్చెఁ. 146

శా. గంగాదేవి యశంగఁ గంపవిభు భా । గ్యంబై నయిల్లాలునా
ఘం గల్యాణగుణున్ మహాద్భుతచరిత్రుం గొల్చె వాక్పుష్పమా
లం గావ్యంబిది వీరముఖ్యముగ లీ । లం దీని నేనాంధ్ర భా
షం గారీకృపఁ గూర్చి మీకొసఁగితిన్ । సర్వజ్ఞ సేవాంచితా.

శా. విద్యావద్య విదూరధూ రధిగతా । విశ్వేశ్వరప్రీణన
ప్రోద్యోగప్రియ! తాడికొండ పురని । ర్వ్యాఘాదరప్రేక్షణా
స్విద్యచ్ఛాత్రసముచ్చ్రియావగత సం । వేద్యా! యశశ్చం
ద్రికా। తద్యోతప్రతిభాసితప్రతిదిశ । ద్యావాపృథివ్యంతరా

కం. ప్రాకృత సంస్కృత వాణీ
ప్రాకట్యనిరూఢిరూఢ । పాండిత్యరమా
ప్రాకృత గుణగణర
త్నాకర! రత్నాకరాయి । తాన్వయసోమా. 149

మా లి ని.

సమధిగతకలాని । ష్వాదితాస్తి క్యసారా
విమలమనునయప్రా । వీణ్యమాన్యప్రచారా
సుమహితశివపూజా । శుద్ధబుద్ధాత్మధారా
నమలినరుచిదీవ్య । న్నాగలింగాఖ్యధీరా! 150

గద్య

ఇది శ్రీమదుమా మహేశ్వర చరణ నళిననిత్యసేవాస
మాసాది తానవద్య కవితాయోగ హృద్య మహితా
త్రేయగోత్ర పవిత్ర హనుమత్సు ధీతనయ విదితనయ
లక్ష్మ్యంబాగర్భశు క్తిముక్తాఫలాయమాన
వేంకట కవీంద్రాత్మ జత్వానూన హను
మాంబా శమీగర్భ హవిర్భుజాయ
మాన శ్రీదేవీసేవ్యమాన.

రా ఘు వ నా రా య ణా భి ధా న
ప్రణీతంబైన

శ్రీ మధురా విజయంబను వీరకంపరాయ చరిత్రంబునందు
సర్వంబును దృతీయాశ్వాసము.

సం పూ ర్ణ ము.

శ్లో॥ యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం తుయద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవనారాయణ నమోఽస్తు తే॥

హ రిః ఓం త త్స త్.

వలయువారు:—

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి

రామలింగేశ్వరపేట,

తె నా